Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 38 • 20-9-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# నిప్పుతో చెలగాటమాడుతున్న కాంగ్రెస్ పార్టీ!

## • ఈ తప్పుకు రాష్ట్రం మొత్తం భారీ మూల్యం చెల్లించక తప్పేట్లు లేదు.

తెలంగాణపై తను తీసుకొన్న నిర్ణయాన్ని తానే అమలు చేయలేని నిస్సహాయ స్థితిలో పడి పోయింది కాంగ్రెస్ అధిష్టానం. వారినా స్థితిలోకి నెట్టింది సమైక్యాంధ్ర ఉద్యమం. ఆ కోణంలో చూసినప్పుడు ఆ ఉద్యమం తన లక్ష్యాన్ని సాధించడంలో సఫలమైనట్లే లెక్క. ఆ ఘనత ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిది. ఈ ఉద్యమానికి ఊపిరి ఊదింది ముఖ్యమంత్రి మహాశయుడే. ఆయన మనసులో ఏమి కోరుకొంటున్నాడో తెలియదు కానీ, కాంగ్రెస్ ముఖ్యమంత్రిగా వుంటూ అదే కాంగ్రెస్‌ను ఉభయ భ్రష్టత్వం పట్టించాడు. సీమాంధ్ర ఉద్యమ ఉధృతి వల్ల తెలంగాణపై గత యాభై రోజులలో ఒక్క అడుగు ముందుకు వేయలేక పోతున్నది కేంద్ర ప్రభుత్వం. సిడబ్ల్యూసి తీర్మానం, ఆ వెంటనే వెలువడిన కాంగ్రెస్ అధికార ప్రతినిధి దిగ్విజయ్ సింగ్ ప్రకటనల ప్రకారం ఈ పాటికి క్యాబినెట్ నోట్ తయారై, మంత్రివర్గ ఆమోదం పొంది రాష్ట్రపతి దగ్గరకు వెళ్లి వుండాలి. ఆ తర్వాత శాసనసభ తీర్మానం, పార్లమెంటు బిల్లు వగైరా తతంగం నడవాలి. కానీ సిడబ్ల్యూసి తీర్మానం తప్ప తెలంగాణ విషయంలో ఇప్పటివరకు ఏమీ చేయ లేదు కేంద్ర ప్రభుత్వం. నిశ్చేష్టత అంటారే అటు వంటిదేదో ఆవహించింది వారిని. హోం మంత్రిత్వ శాఖ అధికారులు క్యాబినెట్ నోట్ తయారు చేసి తమ దగ్గరే అట్టిపెట్టుకొన్నారు. తదుపరి ఆదేశాలు రాక పోవడంతో ఫైళ్ల దొంతరల మధ్య దాచి పెట్టారు. అక్కడ నుంచి అది బయటకు రావాలంటే సోనియాగాంధీ గ్రీన్ సిగ్నల్ కావాలి. కానీ ఆమె నోటి వెంట మాట రావడం లేదు. ఏమి మాట్లాడితే ఏమి తంటా వస్తుందో అన్న సందేహంతో మానసికంగా నలిగి పోతున్నదామె. తెలంగాణ ప్రకటన చేసి తప్పు చేశామా అన్న ఆత్మ పరిశీలనలో మునిగి పోయి వున్నారు. తెలంగాణ విభజన నిర్ణయం తీసుకోవడంలో తప్పు లేదు కానీ, ఆ నిర్ణయాన్ని ప్రకటించే పద్ధతిలో మాత్రం సరిదిద్దుకోలేని తప్పు చేశారన్నది పరిశీలకుల అభిప్రాయం.

తెలంగాణ ప్రజల ఆకాంక్ష, అరవై ఏళ్ల ఉద్యమ అభిలాషలను గౌరవించి రాష్ట్ర విభజనకు నిర్ణయం తీసుకొన్నాము. అయితే ఇందులో మూడు ప్రాంతాల ప్రజల మనోభావాలు, ఆర్థిక ప్రయోజనాలు ముడిపడి వున్నాయి కాబట్టి హైదరాబాద్, నీళ్లు, నిధులు వంటి అంశాల మీద సామరస్య పూర్వక పరిష్కారం కోసం అందరితో చర్చించి ఈ ప్రక్రియను ముందు నడిపిస్తామని ప్రకటించి వుంటే ఏ ప్రాంతంలో కూడా ఈ నిర్ణయం పట్ల ఆందోళన, వ్యతిరేకత వచ్చేది కాదు. కానీ దిగ్విజయ్ సింగ్ ఆ రాజనీతిజ్ఞత ప్రదర్శించలేక పోయారు. హైదరాబాద్ సహిత తెలంగాణ ఇచ్చేస్తున్నాము, ఇక ఇందులో ఎవరు చేయగలిగింది ఏదీ లేదన్న తీరులో ప్రకటన విడుదల చేశాడు. ఆ వెంటనే కెసిఆర్ కూడా ఆంధ్ర ప్రాంత ఉద్యోగులు హైదరాబాద్ వదలి వెళ్లి పోవా

కొరవ 14వ పేజీలో

## పనబాక మీద ఆంధ్ర నేతల కినుక!

కేంద్రమంత్రి పనబాక లక్ష్మి వ్యవహార శైలి సహచర కేంద్రమంత్రులకు తీవ్ర అసంతృప్తి, ఆగ్రహాలు కల్గిస్తున్నది. సీమాంధ్ర ఉద్యమం అందరు రాజకీయవాదులను ఇరకాటంలో పెడుతున్న మాట నిజం. కేంద్ర మంత్రులు, ఎమ్పీలు తమ స్వంత జిల్లాలకు వెళ్లడానికి భయపడుతున్నారు. ఢిల్లీ, హైదరాబాదులకు పరిమితమౌతున్నారు. ప్రజల ఆగ్రహం చవి చూడడం రాజకీయ వాదికి మరణ శాసనంతో సమానం. ఆ ప్రమాదాన్ని తప్పించుకోవడానికి అందరు కేంద్ర

కొరవ 14వ పేజీలో

## జగన్‌కు బెయిల్ ఖాయం?

16 నెలలుగా చెరసాలలో మ్రగ్గుతున్న వైఎస్ జగన్‌కు ఈ వారంలో విముక్తి కలగవచ్చునని న్యాయ నిపుణులు భావిస్తున్నారు. సిబిఐ ఎన్ని అభ్యంతరాలు వ్యక్తం చేసినప్పటికీ, 23వ తేది సిబిఐ ప్రత్యేక కోర్టు ఆయన్ను విడుదల చేస్తుందని భావిస్తున్నారు.

సుప్రీంకోర్టుకు హామీ ఇచ్చిన ప్రకారం సెప్టెంబర్ నెల ముగిసేలోగానే సిబిఐ అధికారులు జగన్ మీద అన్ని ఛార్జ్‌షీట్లను కోర్టుకు సమర్పించారు. దాదాపుగా దర్యాప్తు పూర్తి అయ్యిందనీ తెలియజేశారు. నేర విచారణ సమయంలో దర్యాప్తు పూర్తి అయిన తర్వాత విచారణ ఖైదీగా ఉన్న నిందితులకు బెయిల్ ఇవ్వడం కోర్టులు సహజంగా పాటించే పద్ధతి. నేర తీవ్రత ప్రమాదకరంగా ఉన్నప్పుడు, సాక్షులను ప్రభావితం చేస్తారన్న అనుమానం కల్గిస్తున్నప్పుడు నిందితుడిని బయటకు వదలితే మరిన్ని నేరాలు చేస్తాడనే భావన కల్గినప్పుడు మాత్రమే ఛార్జ్‌షీట్ తర్వాత కూడా జైలులోనే ఉంచుతారు. జగన్ విషయంలో ఆ అనుమానాలు, భయాలకు పెద్దగా ఆస్కారం లేదు. అందువల్ల ఆయనకు బెయిల్ రావడం ఖాయం అన్న అభిప్రాయంతో ఉన్నారు ఆయన పార్టీ నేతలందరూ.

జగన్ బెయిల్ పట్ల రాజకీయంగా వ్యతిరేకత

కొరవ 14వ పేజీలో

## మోడి వ్యామోహం

2014 సాధారణ ఎన్నికలకు తమ పార్టీ ప్రధాన మంత్రి అభ్యర్థిగా నరేంద్రమోడిని ఎంపిక చేసింది బిజెపి. దేశంలో వాస్తవికంగా మిగిలిన రెండంటే రెండు జాతీయ పార్టీలలో అదొకటి. దానిలో జాతీయ స్థాయి నేతలకు కరవు లేదు. రెండంటే రెండు లోక్‌సభ స్థానాల పార్టీగా అవహేళనకు గురైన స్థాయి నుంచి రెండుసార్లు కేంద్రంలో ప్రభుత్వ స్థాపన స్థాయికి పెంచిన ఎల్‌కె.అద్వానీ ఇంకా బ్రతికే వున్నాడు. జాతీయ స్థాయిలో ప్రజలను ప్రభావితం చేయగల్గిన సుష్మాస్వరాజ్, రాజ్‌నాథ్‌సింగ్, మురళీమనోహర్‌జోషి, అరుణ్‌జైట్లీ, యశ్వంత్ సిన్హా వంటి నేతలు లెక్కకు మించి వున్నారు. నరేంద్రమోడి ఒక చిన్న రాష్ట్రానికి పరిమితమైన నేత. ఎన్నడూ పార్లమెంట్‌లో అడుగుపెట్టి ఎరగడు. దేశ రాజకీయాలలో అనుభవం శూన్యం. కానీ బిజెపి మాత్రం మేరునగధీరులుగా పేరుగడించిన నేతలను వదలిపెట్టి, నరేంద్రమోడి మెడలో వరమాల వేసింది.

చూడడానికి విచిత్రంగా కన్పించే పరిణామం ఇది. కానీ సమకాలీన దేశ రాజకీయ పరిస్థితులను పరిగణనలోకి తీసుకొంటే అందులో విచిత్రము, విడ్డూరమైన విషయమేదీ కన్పించదు. ఇందిర, రాజీవ్‌గాంధీల తరం గడచిపోయిన తర్వాత మన దేశంలో జాతీయ స్థాయి నేత అన్న వాడే లేకుండా అదృశ్యమైపోయారు. ఒక రాష్ట్రానికి, ఒక ప్రాంతానికి, ఇంకా చెప్పాలంటే ఒక జిల్లాకు పరిమితమైన ప్రాంతీయ పార్టీల నేతలే దేశ రాజకీయాలను శాసిస్తున్నారు. జాతీయ స్థాయి నాయకత్వం అంతరించిపోయిన జాతిగా మారిపోయింది. మరగుజ్జు నేతలు, కురచ బుద్దుల పార్టీలు మాత్రమే మిగిలాయి మనకు. నూట పాతికేళ్ల మహోజ్వల చరిత్ర కలిగిన కాంగ్రెస్ దుర్గతి కూడా అంతే. ఇందిర హయాంలో ఆమెకు ధీటుగా కాసు బ్రహ్మానందరెడ్డి, నీలం సంజీవరెడ్డి, కమలాపతి త్రిపాఠి, హెచ్.ఎన్.బహుగుణ, వైబి.చవాన్, నిజలింగప్ప, కామరాజ్ నాడార్, మర్రి చెన్నారెడ్డి, పివి.నరసింహారావు వంటి నేతలు వుండేవారు. కానీ ఇప్పటి కాంగ్రెస్ పార్టీలో ఆ స్థాయి నాయకత్వం కాగడాపెట్టి వెతికినా కన్పించడం లేదు. నెహ్రూ వంశోద్ధారకుడిగా రాహుల్‌గాంధీని వెలుగులోకి తేవాలని సోనియాగాంధీ ఎన్నో కలలు కంటున్నది. కానీ ఏమి లాభం. ఆయన తీరు కొయ్య గుర్రం వంటిది. ఎంత వూపినా వున్న చోట నుంచి కదలలేని అశక్తత. కాంగ్రెస్‌లో మిగిలిన నేతలందరూ సోనియాగాంధీ పాదరేణువులే తప్ప తమకు తాముగా ఒక రాష్ట్రంలో అయినా ప్రజల ఆదరణ, అభిమానం, పలుకుబడి కల్గినవారు కారు. ఆమె అనుగ్రహం దక్కితే అందలం ఎక్కడం, లేకుంటే తెరమరుగు కావడం మినహా స్వయంశక్తితో ప్రజల ముందుకు రాగల్గిన నేత అంటూ ఒక్కడు కూడా కన్పించడం లేదు. సిపిఐ, సిపిఎం వంటి వామపక్ష పార్టీల పరిస్థితీ అంతే. అవి ప్రజలకు దూరమై పోయాయి. వారిలో అణుమాత్రం విశ్వాసం పెంచుకోలేక పోతున్నాయి.

చెట్టు లేని చోట ఆముదం చెట్టు మహావృక్షం అన్నట్లు జాతీయ రాజకీయ ముఖ చిత్రంపైకి తారాజువ్వ వలె దూసుక వచ్చాడు మోడి. దేశ ప్రజలలో అధిక సంఖ్యాకులు ఇప్పుడు ఆయనలో ఒక పరిపాలనా దక్షుడిని దర్శిస్తున్నారు. ఒక అభివృద్ధి కాముకుడిని చూడాలనుకొంటున్నారు. దేశం ఎదుర్కొంటున్న సవాళ్లను ఎదుర్కోగల్గిన ఏకైక మొనగాడిగా పరిగణిస్తున్నారు. అందుకు కారణం – చిన్న రాష్ట్రమే అయినప్పటికీ గుజరాత్‌లో ఆయన సాధించిన ప్రగతి. ఎంతో ఉత్తముడనుకొన్న ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ సైతం అవినీతి కల్మషం అంటిన కళంకితుడిగా నిరూపణ కావడంతో దేశ ప్రజలలో ఒక విధమైన నైరాశ్యయం ఆవరిస్తున్నది. అవినీతి, అధిక ధరలు ఆర్థిక సంక్షోభం నిరుద్యోగం, సంపన్నులను మరింత సంపన్నులుగా, పేదలను మరింత పేదలుగా పెంచే అపసవ్య ఆర్థిక విధానాలు, సరిహద్దులో చైనా కవ్వింపు, దేశంలోపల పాక్ ప్రేరేపిత ఉగ్రవాదం, బాంబు పేలుళ్ల వంటి అనేకానేక సమస్యలను ఎదుర్కోవడంలో ప్రభుత్వాలు దారుణంగా విఫలమౌతున్నాయి. ఈ నిరాశాపూరిత, నిరామయ వాతావరణంలో నరేంద్రమోడి వంటి దృఢచిత్తుడు, సచ్చీలుడు, స్వార్థరహితుడు దేశ పాలనా పగ్గాలు చేపట్టాలన్నది ప్రజల ఆకాంక్ష. ఆయన మానసం మత విద్వేషమనే విషపు భాండాగారమని తెలిసి కూడా ఆయన్ను స్వాగితిస్తున్నారు జనం. ఆ జనం నాడి పసిగట్టినందువల్లనే బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్ నాయకత్వం జాతీయ నేతలను పక్కకు నెట్టి నరేంద్రమోడిని తెరమీదకు తెస్తున్నది. అటు పార్టీలో, ఇటు ప్రజలలో ఎన్నో ఆశలు సృష్టించి మరీ రంగప్రవేశం చేస్తున్న నరేంద్రమోడి జాతీయ స్థాయి సవాళ్లను ఎంతవరకు తట్టుకోగలడో, ప్రజలను ఆకట్టుకోగలడో వేచి చూడాలి. ఏది ఏమైనా వర్తమాన భారత రాజకీయాలలో నరేంద్రమోడి ఒక వెలుగు రేఖ, వేగు చుక్క. ఆయన విధానాల పట్ల ఎంతో మందితోపాటు మాకూ విభేదం వున్నా, ఆయన రంగ ప్రవేశాన్ని స్వాగతిస్తున్నాము.

## జనవాణి

### విఆర్‌సిలో వెట్టిచాకిరి!

విఆర్ విద్యా సంస్థలలో ఉద్యోగం వచ్చిందని చాలామంది సంతోషిస్తారు. ఇదేదో గవర్నమెంట్ ఉద్యోగం లాంటిదని 25వేల రూపాయలు జీతమొస్తుందని ఆశపడతారు. వాస్తవమేమంటే విఆర్‌సిలో ముష్టిజీతాలిస్తారు. ఈ జీతాలతో బతకలేక, వయోపరిమితి దాటిపోయి వేరే ఉద్యోగం చేయలేక ఏనాటికైనా పర్మినెంట్ అవుతుందనే ఆశతో చాలామంది ఉద్యోగులు బతుకుతున్నారు. విఆర్‌సి మేనేజ్‌మెంట్ చూస్తున్న ఆనం వివేకానందరెడ్డి ఆ సంస్థలను పతనావస్థకు చేర్చారు. విఆర్ ఐపిఎస్ డబ్బు ఐదు కోట్ల రూపాయలు తీసి వైఎంసిఏ గ్రౌండ్‌లో పెద్ద బిల్డింగ్ కట్టారు. అది దేనికీ పనికిరావడం లేదు. విఆర్ ఐపిఎస్‌లో ప్రస్తుతం జీతాలకు డబ్బు కూడా లేదు. 2003 సంవత్సరంలో విఆర్ ఐపిఎస్‌కు ఎయిడ్ వచ్చింది. కాని వివేకానందరెడ్డి దానిని కాకుండా చేసి ఉద్యోగస్తుల నోట్లో మట్టి కొట్టినాడు. విఆర్ ఐఎఎస్, ఐపిఎస్ సంస్థలలో పని చేసే ఉద్యోగస్తుల జీవితాలు దుర్భరంగా మారాయి. మేనేజ్‌మెంట్ జీతాలు ఇవ్వదు. అటు ఎయిడెడ్ చేయదు. గవర్నమెంట్ ఉద్యోగులు 50వేల రూపాయల పెన్షన్‌కు రిటైర్ అవుతుంటే విఆర్ విద్యాసంస్థలలో ఉద్యోగులు 50వేల రూపాయలకు రిటైర్ అవుతుంటారు. దీన్నిబట్టి వారి జీవితాలు ఎంత నాశనమయ్యాయో అర్థం చేసుకోవచ్చు. విఆర్ విద్యాసంస్థలు ప్రభుత్వపరమైతే తప్ప ఇక్కడ పని చేస్తున్న వారి బతుకులు బాగుపడవు.

*విఆర్ విద్యాసంస్థలలో పనిచేసే బాధితుడు* నెల్లూరు

### ప్రసాదాలు పెట్టడం లేదు!

నెల్లూరు టౌన్‌హాల్‌లో వెలసిన జ్యోతి వినాయక మందిరంలో గత ఐదేళ్లుగా సాయంత్రం భక్తులకు ప్రసాదాలు పెడుతుండినారు. అదే విధంగా వినాయక చవితినాడు ఉదయం నుండి సాయంత్రం వరకు ప్రసాద వితరణ జరిగేది. ఇటీవల కొన్నాళ్లు టౌన్‌హాల్ కమిటీకి ఎవి.కృష్ణారెడ్డి కార్యదర్శిగా పని చేశారు. ఆయన హయాంలో ఒక తీపు ప్రసాదం, మరో మామూలు ప్రసాదం పెట్టేవారు. ప్రస్తుతం టౌన్‌హాల్ వినాయక మందిరం బాధ్యతలు చూస్తున్న వారికి ఏమయ్యిందో ఏమో ఈ ప్రసాదాలు లేకుండా చేశారు. వినాయక చవితి రోజు పంపిణీ చేసిన ప్రసాదం అంతంత మాత్రమే. టౌన్‌హాల్ వినాయకుడు కుబేరుడు. మరి ప్రసాదం పంపిణీలో ఈ పిసినారి తనమెందుకు?

*ఒక భక్తుడు* నెల్లూరు

### సిగ్గులేని చంద్రబాబు!

ప్రతిపక్షనేత చంద్రబాబు వేస్తున్న వేషాలు చూస్తుంటే వెగటు పుడుతున్నది. తెలంగాణకు మద్దతు ఇస్తున్నట్లు కేంద్ర హోంశాఖకు లేఖ ఇచ్చారాయన. ఇప్పుడేమో సీమాంధ్ర జిల్లాలలో ఆత్మగౌరవ యాత్ర చేస్తున్నాడు. ఆయన

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

24-9-1943
పేజీలు:4 వెల: 0-1-6అణా

### బెంగాల్ క్షుద్బాధ!

ఒక్క కలకత్తా నగరంలోనే ఆగష్టు 1 నుండి సెప్టెంబర్ 15 వరకు అంటే 45 రోజులలో 2107 మంది క్షుద్బాధా ఫలితంగా నడివీధులలో నిండు ప్రాణాలను నిలువునా కోల్పోయారు.

వీరుగాక ప్రభుత్వ దృష్టికి రాకుండా బ్రిటీష్ సామ్రాజ్యంలో రెండవ పెద్ద పట్టణమైన కలకత్తాలో యింకెందరు మరణించి యున్నారో ఊహించలేము అని స్టేట్‌మన్ పత్రిక వ్యాఖ్యానించింది.

15వ తేది నుంచి రోజుకు సగటున 50 అనాధ ప్రేత సంస్కారాలు నగరంలోనే జరుగుతూ వున్నాయి. ఇతర పట్టణాలు, పల్లెలలోని మరణాల సంఖ్య ప్రకటింపబడలేదు గానీ, బెంగాల్ రాష్ట్రమంతా ఈ 'డొక్కల కరవు' తీవ్రంగానే వ్యాపించింది.

### నెల్లూరు వార్తలు

సుదర్శనమ్మ లేడీస్ క్లబ్‌కు తిక్కవరపు రామిరెడ్డి గారు 4వేలు భవన నిర్మాణానికిచ్చిరి. శంకుస్థాపన రామిరెడ్డి గారి చేతనే జరుపబడెను. మందిరం నిర్మింపబడుచున్నది.

శ్రీ కస్తూరిదేవి విద్యాలయ కమిటీ సమావేశం 29-8-43 తేదీన జరిగినది. హైస్కూల్ నిర్మాణ ప్రయత్నానికి తిక్కవరపు రామిరెడ్డి, రేబాల పట్టాభిరామిరెడ్డి, ఏనుగ రాఘవరెడ్డి గార్లను ఒక కమిటీ వేసిరి.

విద్యాలయానికి దర్గామిట్టలో వుండే వెంకట్రామయ్య గారు బంగాళా తీసుకుందామనే వూహలో చూస్తున్నారు. 17 ఎకరాల స్థలము, కట్టిన బిల్డింగు సిద్ధంగా వుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

20-9-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పొణకా కనకమ్మ అస్తమయం!

గత ఏడు సంవత్సరాలుగా గుండెజబ్బుతో పడకమీద వుండిన శ్రీమతి పొణకా కనకమ్మ గారు 15వ తేది సాయంకాలం 3.55 గంటలకు నెల్లూరులో ప్రశాంతంగా కన్నుమూశారు. ఆమె వయస్సు 72 సంవత్సరాలు. ఇరువురు సోదరులు – మరుపూరు పిచ్చిరెడ్డి, మరుపూరు కోదండరామిరెడ్డి, ఒక సోదరి పొణకా ఆదెమ్మ గారలు గలరు.

ఆ రోజు ఆమెకు గుండెపోటు రాలేదు. చనిపోవుటకు పదిహేను నిమిషాల ముందు వరకు బాగా స్మృహలో వున్నది, మాట్లాడుతున్నది. కొద్దిసేపు చిరు ప్రక్కలు ఎగురవేసి అకస్మాత్తుగా దేహయాత్ర చాలించింది.

తీవ్రమైన అనారోగ్యంతో అనుక్షణం బాధపడుతూ చావుబ్రతుకుల పోరాటంలో వుండినా, ఒక్కరోజు ముందు వరకు తాను మరణిస్తాననే సందేహంగానీ, భయంగానీ ఆమె చెంతకే రాలేదు. అంతర్వాణి చెప్పిందికాబోలు, 14వ తేది ఆమెకు జీవితం మీద ఆశ సడలింది; తాను యెక్కువ కాలం జీవించబోనని వెలిబుచ్చింది. చావు సమీపించినట్లు తెలిసినా, ఆమె పెదవుల మీద చిరునవ్వు తొలగలేదు. ముఖంలో నిస్పృహ నిరాశాభావాలు ఏమాత్రం కనిపించలేదు. సార్థక జీవితాన్ని గడిపిన ఆమె జాతస్య మరణం ధ్రువం అన్నట్లుగా చావును గూడా గంభీరంగా స్వీకరించింది. దాదాపుగా అర్థ శతాబ్దంపాటు రాజకీయ, సాంఘిక సేవా రంగాలలో అనుపమానమైన, నిస్వార్థమైన పాత్ర వహించి, దిగంత కీర్తినార్జించిన శ్రీమతి కనకమ్మ గారు యిక మనకు లేరు.

# నెల్లూరు ముచ్చట్లు
## విశేషాలు

### చంద్రబాబు రాక!

సీమాంధ్రలో ప్రతిపక్ష నేత చంద్ర బాబు నాయుడు చేస్తున్న రెండవ విడత ఆత్మ గౌరవ యాత్ర ఈ నెలాఖరున నెల్లూరు జిల్లాలో జరుగనుంది. ప్రకాశం జిల్లా నుంచి ఉదయగిరి నియోజక వర్గంలో కాలిడే చంద్రబాబు రోజుకు రెండు నియోజక వర్గాల చొప్పున పర్య టించి ఐదవ రోజు వెంకటగిరి నియోజక వర్గం నుంచి చిత్తూరు జిల్లాలోనికి ప్రవే శిస్తారు. యాత్ర రూట్‌మ్యాప్, తేదీలను జిల్లాలోని పార్టీ వర్గాలతో చర్చించి పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్ర మోహన్‌రెడ్డి ఖరారు చేస్తారు. ఈ మేరకు యాత్ర నిర్వహణపై చంద్రబాబు 16వ తేది హైదరాబాద్‌లో జిల్లాలలోని పార్టీ ముఖ్య నేతలతో సమావేశమయ్యారు. పంచాయతీ ఎన్నికలలో మెరుగైన ఫలి తాలు సాధించిన పార్టీ నేతలను చంద్ర బాబు ఈ సందర్భంగా అభినందించారు.

### నొప్పి భరిస్తూనే ఎస్పీ విధుల నిర్వహణ!

ఎస్పీ రామకృష్ణ నొప్పి భరిస్తూనే విధులకు హాజరవ్వడం ఆయనకు వృత్తి పట్ల ఉన్న నిబద్ధతను తెలియజేస్తుంది. ఎస్పీ ఈ మధ్య బంగళాలో మేడపై నుంచి దిగుతూ పొరపాటున జారిపడ్డారు. దీని మూలంగా వెన్నుపూస నొప్పితో బాధ పడుతున్నారు. అయినా 15వ తేది ప్రజా విజ్ఞప్తుల దినానికి హాజరై బాధ బయ టకు తెలియజేయకుండా కూర్చొని బాధి తుల సమస్యల పరిష్కారానికి క్రింది స్థాయి అధికారులకు ఆదేశాలిచ్చారు.

### నెల్లూరుకు ప్రాకిన స్క్రబ్ టైఫస్ జ్వరం!

హైదరాబాదీయులను గత్తర పెడు తున్న స్క్రబ్ టైఫస్ జ్వరం నెల్లూరుకు సైతం వచ్చేసింది. సంగం, నెల్లూరులో ఈ జ్వరం బారినపడిన 15 మందికిపైగా రోగులకు గాంధీనగర్‌లోని ఓ ఫిజిషి యన్ చికిత్స చేశారు. ఇద్దరిని మాత్రం చెన్నైకు పంపారట. ఈ జ్వరం ఊరకే ప్రాణాలు తీస్తుంది కాబట్టి దీనిపట్ల నెల్లూ రీయులు అప్రమత్తంగా ఉండాల్సి ఉంది. వైద్య ఆరోగ్య శాఖాధికారులు ఈ జ్వరం లక్షణాలపై గ్రామాల్లో ప్రచారం చేయాల్సి వుంది.

### జిల్లా జడ్జిగా దుర్గారావు!

నెల్లూరు జిల్లా జడ్జిగా సి.హెచ్.కె దుర్గారావు నియమితులయ్యారు. ఈయన గతంలో సికింద్రాబాద్ సిటీ కోర్టులో అదనపు సెషన్స్ కోర్టు న్యాయ మూర్తిగా పనిచేసేవారు. జిల్లా జడ్జిగా శ్రీరామ్మూర్తి పదవీ విరమణ చేశాక చాలా రోజులుగా ఈ పదవి ఖాళీగా ఉండింది.

### పెద్దాసుపత్రికి సూపరింటెండెంట్!

నెల్లూరు పెద్దాసుపత్రి సూపరింటెం డెంట్‌గా డాక్టర్ రవీంద్రనాధ్ ఠాగూర్ నియమితులయ్యారు. పెద్దాసుపత్రిలో కీళ్లు, ఎముకల విభాగానికి అధిపతిగా పనిచేసేవారాయన. పాత సూపరింటెం డెంట్ డాక్టర్ సుబ్బారావు కడప జిల్లా ప్రభుత్వాసుపత్రుల సమన్వయకర్తగా బదలీ అయ్యారు.

### ఐడి పార్టీ ఇన్‌ఛార్జ్ శ్రీనివాసులురెడ్డి!

ఎస్పీ ఐడి పార్టీకి ఎంతో ప్రాము ఖ్యత ఉంది. ఈ ఐడి పార్టీ ఇన్‌ఛార్జ్‌గా శ్రీనివాసులురెడ్డి నియమితులయ్యారు. ఈయన ఐదవ పట్టణ ఎస్ఐగా పని చేస్తుండే వారు. విధి నిర్వహణలో మంచి అధికారిగా మన్ననలు పొందారు. ఐడి పార్టీలో శ్రీనివాసులురెడ్డి రాణిస్తాడనే చెప్పాలి.

### జిల్లా సహకారాధికారి

జిల్లా సహకారాధికారిగా మల్లి కార్జునరెడ్డి 13వ తేది బాధ్యతలు స్వీక రించారు. ఆదిలాబాద్ జిల్లా సహకారా ధికారిగా పనిచేస్తుండిన ఈయన్ను నెల్లూ రుకు బదలీ చేశారు.

### నెల్లూరు ఆర్డీఓ బదలీ

నెల్లూరు ఆర్డీఓ డాక్టర్ మాధవీ లత బదలీ అయ్యారు. ఆమెను తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ(తుడా) కార్యదర్శిగా నియమించారు. 2010 జూన్‌లో ఆర్డీఓగా బాధ్యతలు తీసుకున్న మాధవీలత నిశ్శ బ్దంగా విధుల నిర్వహణ చేసేవారు. అధి కార పార్టీ నేతల మూలంగా కొన్నిసార్లు ఇబ్బందులను ఎదుర్కొన్నా వాటిని అధిగ మించారామె.

నెల్లూరు ఆర్డీఓగారాను కావలి ఆర్డీఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి ప్రయత్నాలు మొదలు పెట్టారు. మాధవీలత బాధ్యత లను డిఆర్‌డిఏ పిడి వెంకట సుబ్బయ్య తాత్కాలికంగా స్వీకరించారు.

### స్పందించని డయల్ 100!

అత్యవసర పరిస్థితుల్లో పోలీసుల సహాయార్థం మనం ఫోన్‌చేసే నెంబరు 100. ఈ ఫోన్ 14వ తేది రాత్రి స్పం దించ లేదు. నెల్లూరు ఆంధ్రజ్యోతి కల్చ రల్ రిపోర్టర్ శిగినం కృష్ణయ్యను ఆటో డ్రైవర్లు దోచుకోవడమే గాక తీవ్రంగా గాయపర్చారు. ఈ సమయంలో నెల్లూరు శివారు ప్రాంతమైన బురాన్‌పూర్ చెరువు నుంచి కృష్ణయ్య 100కు డయల్ చేయగా స్పందించలేదు. 16వ తేది ఎస్పీ రామ కృష్ణకు ఈ దుర్మార్గాన్ని వివరించను వెళ్లిన జర్నలిస్టుల బృందం ఆయన దృష్టికి ఈ విషయాన్ని తీసుకెళ్లింది. ఈ విషయమై విచారణ చేయిస్తానని ఎస్పీ విలేకరులకు హామీ ఇచ్చారు. ఈ మేరకు అక్కడ విధులు నిర్వహించే హెడ్ కానిస్టేబుల్‌కు మెమో జారీచేశారు. 24 గంటలపాటు స్పందించాల్సిన ఫోనిది. ఇక్కడ కాస్త చురు కుగా ఉండే సిబ్బందిని నియమించాల్సి వుంది.

### విదేశీ పర్యటనకు బీద మస్తాన్‌రావు!

కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు 13వ తేది విదేశీ పర్యటనకు బయలుదేరి వెళ్లారు. ఐర్లాండ్, అమెరికాలో పర్య టించి వారం తర్వాత నెల్లూరు వస్తారు.

### నెల్లూరులో విషజ్వరాలు అరికట్టే డాక్టర్!

మాయదారి జ్వరాలొచ్చి జనం ప్రాణాలు తీస్తున్న రోజులివి. వీటికి చికిత్స పొందను చెన్నైకు వెళ్లాల్సి వస్తుండేది. అటువంటి అవసరం లేకుండా నెల్లూరు మద్రాసు బస్టాండ్ వద్దగల అహల్యాదేవి నర్సింగ్ హోమ్‌లో డాక్టర్ ఎం.సి.ఎన్ రెడ్డి పెట్టిన క్లినిక్‌ను నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 12వ తేదిప్రారంభించారు. ఈ క్లినిక్ ఇన్‌ఫెక్షు వల్ డిసీసెస్(విష జ్వరాలకు) ప్రత్యేక చికిత్స చేస్తారు. బిపి, షుగర్, థైరాయిడ్, కిడ్నీ, మూర్ఛలతోపాటు మలేరియా, టైఫాయిడ్, డెంగ్యూ జ్వర బాధితులకు 24 గంటలు చికిత్స చేస్తానంటున్నారు డాక్టర్ ఎంసిఎన్‌రెడ్డి.



నెల్లూరు జూనియర్ చాంబర్ జర్నలిస్ట్ డేను పురస్కరించుకొని ఉత్తమ సేవలకుగాను జమీన్‌రైతు సహాయ సంపాదకుడు అల్లూరు రహీంను సన్మానిస్తున్న చాంబర్ అధ్యక్షుడు తవ్వా శ్రీనివాసులు. ప్రక్కన జెసీస్ ముఖ్యులు బాలఓబులేశ్వరరావు, మధుబాబు, యోగవల్లి, సునీతాలక్ష్మీ వున్నారు.

### ప్రైవేటు విద్యా సంస్థల మూత!

సమైక్యాంధ్రకు మద్దతుగా జిల్లా లోని ప్రైవేటు విద్యా సంస్థలు 14వ తేది నుంచి 17వ తేది వరకు మూతపడ్డాయి. ఉద్యమంలో భాగంగా ప్రైవేటు పాఠశా లలు నడపడాన్ని తప్పు పట్టడంతో వెయ్యికిపైగా ప్రైవేటు పాఠశాలలు, 174 జూనియర్ కాలేజీలు, 26 ఇంజనీరింగ్ కాలేజీలు, 26 ఎంబిఏ, ఎంసిఏ, 61 డిగ్రీ కాలేజీలు, 10 పిజి కాలేజీలు మూత పడ్డాయి.

16వ తేది హైదరాబాద్‌లో సమా వేశమైన 150 ఉద్యోగ సంఘాలు ఈ నెల 23 నుంచి 30వ తేది వరకు ప్రైవేటు పాఠశాలలు, కళాశాలలు మళ్లీ మూసి వేయాలన్న కార్యాచరణ ప్రకటించింది. దీనికి జిల్లాలో స్పందన ఏవిధంగా ఉం టుందో వేచి చూడాలి.

### రైల్వేస్టేషన్ పరిశీలన!

జడ్ఆర్‌యూసిసి సభ్యుడు ప్రత్తి సీతారాంబాబు 15వ తేది రైల్వేస్టేషన్‌ను పరిశీలించారు. స్టేషన్ మేనేజర్ ఎండి షాజహాన్‌కు కొన్ని సూచనలు చేశారు. స్టేషన్‌కు మూడు ఎస్కలేటర్స్ మంజూర య్యాయి. వీటికి సంబంధించి స్టేషన్‌లో జరుగుతున్న పనులను ఆయన పరిశీలిం చారు. మొదటి ప్లాట్‌ఫారం మీదే స్టాల్ ఉందని మరో ప్లాట్‌ఫారంపై స్టాల్ అద నంగా ఏర్పాటు చేయమన్నారు. నాలుగో నెంబర్ ప్లాట్‌ఫారంపై ఉన్న ప్రయాణీ కులు వేచి ఉండే గదిలో ఫ్యాన్లు, కుర్చీలు లేవన్నారు. స్టేషన్ వద్ద మరో రెండు ఫుట్‌ఓవర్ బ్రిడ్జీలు ఏర్పాటు చేస్తే ప్రయా ణీకులు పట్టాలు దాటే పరిస్థితి ఉండ దని ప్రయాణీకులు ఈ సందర్భంగా సీతారాంబాబు దృష్టికి తీసుకొచ్చారు.

### నరేంద్ర మోడి జన్మదినం

గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడి జన్మదినోత్సవాన్ని 17వ తేది భార తీయ జనతా మజ్దూర్ మహాసంఘ్ నర్తకి సెంటర్‌లో నిర్వహించింది. ఈ సంద ర్భంగా సంఘ నాయకుడు ఆత్మకూరు అంకయ్య మాట్లాడుతూ నరేంద్రమోడి నాయకత్వంలో కేంద్రంలో బిజెపి ప్రభు త్వం ఏర్పడడం ఖాయమన్నారు.

### సోనియా ముందు డప్పు కొట్టన్నా!

సమైక్యాంధ్ర కోసం ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నెల్లూరులో డప్పు కొట్టాల్సిన అవసరం లేదని ఇక్కడ డప్పు కొట్టే కళాకారులు పలువురున్నారని ఆనం జయకుమార్‌రెడ్డి సూచించారు. గాంధీబొమ్మ వద్ద 16వ తేది సమైక్యాం ధ్రకు మద్దతుగా దీక్ష చేస్తున్న ఉపాధ్యా యులకు సంఘీభావంగా మాట్లాడుతూ వివేకానందరెడ్డి ఢిల్లీలో సోనియాగాంధీ ముందు డప్పుకొట్టి ద్యాన్సులేస్తే బాగుం

కొరవ 14వ పేజీలో

# దొంగతనాలు ఆపడంపై దృష్టిసారించిన ఎస్పీ!



నెల్లూరు నగరంలో వేళాపాళా, భయం, భక్తి లేకుండా జరుగుతున్న దొంగతనాలపై ఎస్పీ రామకృష్ణ దృష్టి సారించారు. దొంగతనాల నివారణ ధ్యేయంగా పట్టణ పోలీసులు పనిచేసేలా ప్రణాళిక రూపొందించినట్లు తెలిసింది. దీనికోసం ప్రత్యేక సిబ్బందిని సిద్ధం చేసి వారు నిత్యం చేసిన పని తాలుకు వివరాలు సమీక్ష చేసే బాధ్యతను నగర డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డికి అప్పగించారు. నగరంలోకి వచ్చిపోయే వారిని పరిశీలించేందుకు నెల్లూరు పెన్నా బ్రిడ్జి, ఇరుగాళమ్మ గుడి, వేదాయపాళెంలలో ప్రత్యేక చెక్‌పోస్టులు ఏర్పాటు చేశారు. నగరంలో వేగంగా

## సానుకూల ఫలితాలు

తిరుగుతున్న స్పీడ్ బైక్‌లను ఆపి తనిఖీ చేయను ఏర్పాటుచేసిన ప్రత్యేక పోలీస్ బృందాలు మంచి ఫలితాలు సాధించినట్లు తెలిసింది. ఈ బృందాలు వాహనదారులను క్షుణ్ణంగా పరిశీలించి అనుమానమొస్తే ఎమ్మార్వో ముందు ప్రవేశ పెడుతున్నారు. వాహనదారులను వదిలివేస్తే వాహనాలను వదలి వెళ్లిపోయిన సాదృశ్యాలుండడంతో వీరిని వెళ్లనీయకుండా స్కూటర్ల తాలుకు అన్ని వివరాలు తీసుకొంటున్నారు. ఈ ప్రత్యేక డ్రైవ్‌లో రెండు దొంగల ముఠాలు సైతం పోలీసుల చేతికి చిక్కాయని విశ్వసనీయంగా తెలిసింది. వీరిని రహస్యంగా విచారిస్తున్నారట. దొంగలు పట్టుబడుతూనే ఉన్నా కొత్త దొంగలు పుట్టుకు రావడం పోలీసులను కాస్త తికమక పెడుతున్నా ఎస్పీ ఎప్పటికప్పుడు చేసే సమీక్షలలో క్రిందిస్థాయి సిబ్బంది దశ, దిశానిర్దేశం చేస్తున్నారు. క్రైం విభాగంలో పనిచేసే సిఐలు వీరాంజనేయరెడ్డి, బాజీజాన్ సైదాలు చురుకైన అధికారులుగా గతంలో పేరుగాంచారు. ఈ మధ్య వారు కాస్త వెనుకబడినా ఎస్పీ ఇచ్చిన ధైర్యంతో ముందుకు సాగుతున్నారు. క్రైం పోలీసులు చురుగ్గా పనిచేస్తే నగరంలో నేరాలు జరగవన్న సంగతి అందరికి తెలిసిందే. ఆ వైపుగా వాళ్లు సైతం పనిచేయాల్సి వుంది.

# ప్రైవేట్ బస్సుల దోపిడీ!

● పర్మిట్ లేకుండా నడుస్తున్నాయి

సమైక్యాంధ్ర ఉద్యమంలో ఆర్టీసిలోని అన్ని కార్మిక సంఘాలు పాల్గొంటుండడంతో జిల్లాలో ఆర్టీసి బస్సులు పూర్తిగా స్తంభించిపోయాయి. వివిధ ప్రాంతాల ప్రజలు రాకపోకలు సాగించేందుకు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దీన్ని అవకాశంగా చేసుకున్న ప్రైవేట్ బస్సు ఆపరేటర్లు ఛార్జీల పేరుతో ప్రజలను నిలువునా దోచుకొంటున్నారు. నగరంలో నడిచే టౌన్ బస్సులను వాటి యజమానులు గ్రామీణ ప్రాంతాల్లో తిప్పుతున్నారు. రవాణా శాఖ నుంచి ఎలాంటి అనుమతులు లేకపోయినా ఇష్టానుసారంగా నడుపుతూ నిలువునా దోచుకొంటున్నారు. నగరంలో టౌన్‌బస్సుల రవాణాలో గుత్తాధిపత్యం కల్గిన యజమానులు తమ బస్సులను అధిక సంఖ్యలో ఆత్మకూరు - నెల్లూరుకు నడుపుతున్నారు. విపరీతమైన రద్దీతో తిరిగే ఈ బస్సుల్లో పనిచేసే వారికి అధిక మొత్తాలు చెల్లిస్తున్నారట. సాధారణ ఛార్జీలకంటే రెండింతలుగా వసూలు చేస్తున్నా రవాణా శాఖ అధికారులుగానీ, ఇటు పోలీ



ఆత్మకూరు వెళ్లను సిద్ధంగా వున్న టౌన్‌బస్సు.

సులు గానీ పట్టించుకోకపోవడం విమర్శల పాలవుతోంది. మరికొన్ని వాహనాలు సోమశిల వైపు తిరుగుతున్నాయి. ప్రైవేట్ బస్సులు నడిపేందుకు ఏ ప్రాంతానికి అయితే ప్రభుత్వం పర్మిట్ ఇచ్చిందో అదే ప్రాంతంలో నడపాలి. ఆర్టీసి బస్సులు లేక ప్రయాణీకులు పడుతున్న ఇబ్బందులను అవకాశంగా చేసుకొని ప్రైవేట్ బస్సుల యాజమాన్యాలు అక్రమాలకు పాల్పడుతున్నా వాటిని పట్టించుకోక పోవడానికి కారణం పెద్దఎత్తున అందుతున్న ముడుపులేనన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి.

# ఆనం భజన కీర్తనల ఆలాపనలో చాట్ల!

## విస్తుపోయిన కాంగీయులు

పైకి మెత్తగా ఏమీ తెలియని వాడిలాగా కన్పిస్తున్నప్పటికీ డిసిసి ఇన్‌ఛార్జ్ అధ్యక్షుడు చాట్ల నరసింహరావులో బహుముఖ ప్రజ్ఞ దాగి వుంది. తనకు గిట్టని వాళ్లైతే సొంత పార్టీ వారైనా, ప్రతిపక్ష పార్టీ వారైనా వారి పట్ల తేనె పూసిన కత్తిలా వ్యవహరిస్తాడని కాంగ్రెస్ పార్టీ నేతలే వ్యాఖ్యానిస్తుంటారు. అలాంటి చాట్ల నరసింహారావు సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటున్న జెఏసి కో కన్వీనర్ ప్రసాద్‌పై ఆనం అనుచరులు దాడి చేశారని వస్తున్న ఆరోపణలపై స్పందించారు. ఆనం కుటుంబం 1972 నుంచి సమైక్యాంధ్ర కోసం పాటుపడిన వారని కీర్తించారు. ఇక తమ నాయకుడు, రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిని ఆకాశానికి ఎత్తేశారు. వివేకానందరెడ్డి దేవుడిని పూజించి దినచర్య ఆరంభించే దైవభక్తి పారాయణుడని, అలాంటి వ్యక్తి ఇతరులపై దాడి చేయమని ఏనాడూ ప్రోత్సహించదని, అది ఆయన తత్వానికే విరుద్ధమని తనదైనశైలిలో రకరకాల



హావభావాలతో ప్రకటించాడు. గత పన్నెండేళ్లుగా తెలంగాణ రాష్ట్ర సమితి చేస్తున్న కార్యక్రమాలు, వారి వ్యాఖ్యలను తీవ్రంగా ఖండిస్తూ సమైక్యాంధ్ర వాణిని విన్పించడంలో వివేకానందరెడ్డి అందరికంటే ముందున్నాడని కీర్తించి తన స్వామి భక్తిని చాటుకొన్నాడు. చాట్ల నోటి వెంట ఆనం భజన కీర్తనలు విన్న కాంగ్రెస్ వర్గీయులే ఆశ్చర్యపోయారు. విచిత్రమేమంటే ప్రసాద్‌ను కాంగ్రెస్ పార్టీలోనికి తెచ్చింది చాట్లే కావడం విశేషం.

# ఊపులేని వినాయక చవితి ఉత్సవాలు!

● నిర్వహణ భారంగా మారడమే కారణం



చిన్నబజారులో గతంలోలా ఘనంగాలేని గణపతి.

నెల్లూరులో గత రెండు దశాబ్దాలుగా వినాయక చవితి సందర్భంగా నిర్వహించే నవరాత్రోత్సవాలు ఘనంగా జరిగేవి. కాపువీధి, ట్రంకురోడ్డు, చిన్న బజారు, పెద్ద బజారులలో పెద్ద పెద్ద వినాయకుల విగ్రహాలు ఏర్పాటుచేసి తొమ్మిదో రోజు నిమజ్జనం చేసేవారు. రాను రాను వినాయక చవితి ఉత్సవాల నిర్వహణ భారంగా మారడంతో చవితి వెళ్లిన మూడో రోజు, అంటే 11వ తేది నగరంలో వందల విగ్రహాలు నిమజ్జనం చేసేశారు. దినసరి ఖర్చు భరించలేక నిమజ్జనం అసలు చేయకూడని రోజు శుక్రవారం 13వ తేది మరికొన్ని విగ్రహాలను నిమజ్జనం చేశారు. 15వ తేది నగరంలోని దరిదాపులు అన్ని విగ్రహాలు నిమజ్జనం చేసేశారు. ఈ యేడాది ఎప్పటి మాదిరిగానే చిన్నబజారు రాణాప్రతాప్ సెంటర్, కాపువీధి, బాలాజీనగర్, వేదాయపాళెం, నిప్పో సెంటర్‌లతోపాటు అయ్యప్పగుడి, పప్పులవీధిలో పెద్ద పెద్ద వినాయక విగ్రహాలను ఏర్పాటు చేశారు. కేవలం విగ్రహాల కోసమే 25వేల నుంచి లక్ష రూపాయల వరకు ఖర్చు చేయాల్సి వస్తుంది. స్టేజి, హైరర్స్, లైటింగ్ ఖర్చు లక్షల్లో పెరిగి పోయింది. వినాయకచవితి రోజు ప్రతిష్టించిన విగ్రహానికి పూజ చేయను పూజారులు మూడు వేల నుంచి ఐదువేల రూపాయల వరకు సంభావన తీసుకొని రికార్డులు నెలకొల్పారు. మైక్‌సెట్, స్వామివారి నిత్యపూజకు ఐదువేల రూపాయల పైబడే ఖర్చు చేయాల్సి వస్తుంది. ప్రసాదాలైతే పెద్ద సెంటర్లలో పదివేలకు మించి ఖర్చు చేయాల్సి వస్తుంది. వినాయకునికి రోజు మార్చవలసిన పూలమాలకు వేల రూపాయలు ఖర్చు చేయాల్సిన రోజులివి. ప్రత్యేక కార్యక్రమాలైన పాట కచ్చేరి ఖర్చు విపరీతంగా పెరిగిపోవడంతో పెద్ద పెద్ద సెంటర్లలోనే ఈసారి ఈ కచ్చేరీలు జరిగాయి. లడ్డూపాటలు కూడా రెండు లక్షల రూపాయలలోపే జరిగాయి. అపార్టుమెంట్‌లలోనే వినాయక ప్రతిష్టకు 50వేలకు మించి ఖర్చు చేయాల్సి వస్తుంది. ఇక వీధుల్లో వినాయక ప్రతిష్టకు లక్షల్లో ఖర్చు చేయాల్సి రావడం, సమైక్యాంధ్ర ఉద్యమం, ఉద్యోగులకు జీతాలు లేకపోవడం వంటి కారణాలన్నీ నెల్లూరులో వినాయక చవితి వైభవాన్ని కాస్త తగ్గించాయనడం నిజం.

# సృజనాత్మకతకు క్రీడలు దోహదపడతాయి!

పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ ఆధ్వర్యంలో నెల్లూరులోని కొండాయపాళెం దళితవాడలోని నగర పాలక ప్రాథమిక పాఠశాలలోని విద్యార్థులకు 13వ తేది ఉచితంగా ఆట వస్తువులు అందజేశారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన వామ్మిన సతీష్ మాట్లాడుతూ పేద పిల్లలకు సాయం చేయాలనే మంచి ఆలోచనతో ముందుకు వచ్చిన అందె శ్రీనివాసులు అభినందనీయులన్నారు. పిల్లలలో సృజనాత్మకత వెలికి తీయను క్రీడలు ఎంతగానో దోహదపడతాయన్నారు. ప్రముఖ వ్యాపారవేత్త ఎం. వెంకటేశ్వర్లు మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలలను ఎంచుకొని అందులోని విద్యార్థులకు ఆట వస్తువులు, పుస్తకాలు, అట్టలు అందిస్తున్న పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు కె.మురళీమోహన్ రాజును అభినందించారు. ఈ కార్యక్రమంలో రోటరీ క్లబ్ ప్రెసి



వాలీబాల్ అందిస్తున్న అందె శ్రీనివాసులు.

డెంట్ ఎం.టి.సుందరి, రామ్‌ప్రభు, గోగులపల్లి రవి, స్కూల్ హెడ్మాస్టర్ ఎం.భాస్కర్‌రావు, సర్వేపల్లి రామ్మూర్తి తదితరులు పాల్గొన్నారు.

# కావలి కేకలో రాజకీయ అలజడి!

## ●కాంగ్రెస్, వైకాపా నేతలను వేదిక ఎక్కనీయలేదు

సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా కావలిలో 'కావలి కేక' పేరుతో జరిగిన కార్యక్రమంలో రాజకీయ స్పర్ధలు చోటు చేసుకొన్నాయి. ఎన్జీ ఓలు, అధికారులు ప్రజా సంఘాల ఆధ్వర్యంలో జరిగిన ఈ సభకు రాజకీయ పార్టీలకు చెందిన నేతలెవరినీ పిలవలేదు. వేదిక మీద కూడా కేవలం ఎన్జీఓలు, అధికారులే వున్నారు. ఈ పరిస్థితుల్లో కాంగ్రెస్ పార్టీ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలకు చెందిన నేతలు వేదికనెక్కడం గొడవకు దారితీసింది. మొదటగా కాంగ్రెస్ పార్టీకి చెందిన ప్రసన్న తదితరులు వేదికనెక్కగా అధికారులు క్రిందకు దించేశారు. ఆ తర్వాత వచ్చిన కావలి నియోజకవర్గ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి వేదికపైకి వచ్చారు. దీంతో క్రిందవున్న కాంగ్రెస్ నేతలు అధికారులను వుద్దేశించి మమ్మల్ని దించి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలను ఎలా వేదికనెక్కిస్తారని ప్రశ్నించడంతో వివాదం రేగింది. ఈ సందర్భంలో వైకాపా నేత రామిరెడ్డి రామ్మోహన్‌రెడ్డికి, కాంగ్రెస్ నేత గంధం ప్రసన్నకు మధ్య గొడవ జరిగింది. మాటామాటా పెరిగి ఒకరినొకరు తోసుకొనేవరకు వెళ్లడంతో, మరో వైకాపానేత చింతం బాబురెడ్డి తమ నేతలకు మద్దతు పలకడంతో వివాదం పెద్దదైంది. దీంతో ఉద్యోగ సంఘాలు, అధికారులు జోక్యం చేసుకొని గొడవను సర్దుబాటు చేయడంతోపాటు వేదికపైనున్న వైకాపానేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డిని క్రిందకు పంపించడంతో వివాదం సద్దుమణిగింది. అదే సమయంలో అక్కడకు వచ్చిన ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు క్రింద వుండే మద్దతు తెలిపారు.

# ఆ పార్టీలకు ప్రజలు గుణపాఠం చెబుతారు!

## కాంగ్రెస్, వైకాపాలను విమర్శించిన బీద



బోగోలులో సమైక్యాంధ్ర ర్యాలీలో కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు.

తెలుగు ప్రజల ఆత్మగౌరవాన్ని నట్టేటముంచి నీతులు వల్లించే రాజకీయ పార్టీలకు రానున్న రోజుల్లో ప్రజలు తగిన గుణపాఠం చెప్పనున్నారని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు వ్యాఖ్యానించారు. సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా ఉద్యోగుల, విద్యార్థులతో కలసి తెలుగుదేశం పార్టీ చేపట్టిన ర్యాలీలో పాల్గొన్న ఆయన సమైక్యాంధ్ర నినాదాలు చేస్తూ విద్యార్థులను ఉత్సాహపరిచారు. జెండా చేతబట్టుకొని ఉద్యమకారులతో కలసి తిప్ప జాతీయ రహదారి నుంచి విశ్వనాథరావుపేట పంచాయితీ మీదుగా బోగోలు వరకు జరిగిన ర్యాలీలో ముందుండి నడిచారు. ఈ సందర్భంగా బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ రాష్ట్ర విభజన వద్దని, తెలుగు ప్రజలందరూ సమైక్యంగా వుండాలని కోరుతూ గత ఒకటిన్నర నెల నుంచి ఉద్యమం చేస్తుంటే ముఖ్యమంత్రి, మంత్రులు ఎవరూ ఇందులో పాల్గొనకపోవడం సిగ్గు చేటన్నారు. తక్షణం వారు తమ పదవులకు రాజీనామాలు చేసి ఉద్యమంలో భాగస్వాములు కావాలన్నారు. స్వార్థం కోసం రాష్ట్ర విభజనకు కాంగ్రెస్ పార్టీ పూనుకొన్నదని, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తప్పుడు ప్రకటనలతో ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నదన్నారు. వీరందరూ కలసి తెలుగువారి ఆత్మగౌరవాన్ని దెబ్బ తీశారన్నారు. తెలుగు ప్రజల కోసం పుట్టిన పార్టీ టిడిపి అని, అలాంటి పార్టీని కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు విమర్శించడం ప్రజలను తప్పుదోవ పట్టించడమేనన్నారు. సమైక్యాంధ్ర సాధించే వరకు ఉద్యమం కొనసాగిస్తామన్నారు. ఈ సందర్భంగా విద్యార్థులు దేశ నాయకుల వేషధారణలో ర్యాలీలో పాల్గొనడం ఆకట్టుకొంది.



ప్రభుత్వ గుర్తింపును చూపిస్తున్న కరస్పాండెంట్ సుధాకర్‌రెడ్డి, ప్రిన్సిపాల్ సుబ్బారావు.

## ● గీతాంజలి ఇంజనీరింగ్ కాలేజికి

# ఈ గవర్నెన్స్ క్యాంపస్ గుర్తింపు!

గీతాంజలి ఇంజనీరింగ్ కళాశాలకు ఈ గవర్నెన్స్ క్యాంపస్ గుర్తింపు లభించింది. దేశవ్యాప్తంగా 100 ఇంజనీరింగ్ కళాశాలలను ఎంపిక చేస్తూ అందులో గీతాంజలి కళాశాల జిల్లా నుంచి ఎంపిక కావడం విశేషం. ఢిల్లీ యూనివర్సిటీ సభ్యులుగా వున్న ఎన్ఐసి మాజీ డైరక్టర్ జనరల్ డాక్టర్ మోని, డాక్టర్ సంజీవ్ సింగ్‌లు ఈ ఎంపిక చేశారు. ఈ గవర్నెన్స్ కళాశాలలుగా ఎంపికైన ఇంజనీరింగ్ కాలేజీలు ఆయా జిల్లాలలో నోడల్ సెంటర్లుగా వ్యవహరిస్తూ జిల్లా పాలనా యంత్రాంగంతో కలసి వివిధ శాఖల్లోని ఐటి అవసరాలను గుర్తించి తమ సేవలందిస్తారు. కళాశాల కరస్పాండెంట్ ఎన్.సుధాకర్‌రెడ్డి, ప్రిన్సిపాల్ సుబ్బారావు, మురళీకృష్ణ జిల్లా కలెక్టర్ శ్రీకాంత్‌ను కలసి దీనిపై చర్చించారు. ఈ సందర్భంగా కరస్పాండెంట్ సుధాకర్‌రెడ్డి మాట్లాడుతూ కలెక్టర్ సానుకూలంగా స్పందించారన్నారు. తమ కళాశాలలోని కంప్యూటర్ సైన్స్ విభాగంలోని విద్యార్థులు, ఉపాధ్యాయులు సంయుక్తంగా దీని గురించి ప్రణాళిక రూపొందించనున్నట్లు చెప్పారు. అలాగే సివిల్ ఇంజనీరింగ్ విభాగంలో బిల్డింగ్ మెటీరియల్ నాణ్యతను నిర్ధారించే అధునాతన యంత్ర పరికరాలు అందుబాటులో వున్నాయన్నారు. భవన నిర్మాణాలు, రోడ్లు, ఇతరత్రా కట్టడాలకు వినియోగించే స్టీలు, సిమెంట్, కాంక్రీట్, తారు, మట్టి, ఇటుకలు, గ్రావెల్ నాణ్యతను పరీక్షించి ఇచ్చి తమైన నివేదిక ఇవ్వవచ్చన్నారు. నిర్మాణ రంగంలోని వారు ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని కోరారు.

# విడవలూరు గ్యాంగ్‌రేప్‌పై పోలీసుల మౌనమేల?

## బాధితురాలికి బెదిరింపు ఫోన్లు

విడవలూరు మండలం రామతీర్థం పంచాయతీ పరిధిలో పాతూరు గ్రామంలో ఒక వివాహితపై సామూహిక అత్యాచారం జరిగి పది రోజులు గడిచినా పోలీసులు పెద్దగా స్పందించడం లేదు. ఇంట్లో ఒంటరిగా వున్న తనపై అదే గ్రామానికి చెందిన కొందరు యువకులు అత్యాచారం చేయడంపై బాధితురాలు విడవలూరు పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు కూడా చేయడం జరిగింది. ఈ సంఘటనపై వెంటనే స్పందించి విచారణ చేపట్టాల్సిన పోలీసులు రాజకీయ జోక్యం కారణంగా కొంచెం వెనుకంజ వేశారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. కొందరు గ్రామ పెద్దలు నిందితుల తరపున రంగ ప్రవేశం చేసి కేసు నీరుగార్చే ప్రయత్నం చేస్తున్నట్లు సమాచారం. బాధితురాలి నుంచి ఫిర్యాదు తీసుకున్న పోలీసులు వైద్య పరీక్షలకు పంపి చేతులు దులుపుకున్నట్లు తెలిసింది. బాధితురాలికి న్యాయం జరగకపోవడంతో ఆగ్రహం చెందిన మత్స్యకారులు జిల్లా ఎస్పీని కలిసి వినతిపత్రం సమర్పించారు. సంఘటన జరిగి రోజులు గడుస్తున్న కొద్దీ బాధితురాలికి బెదిరింపులు వస్తున్నాయి. దేశవ్యాప్తంగా మహిళలపై జరుగుతున్న అత్యాచారాలపై చర్చ జరిగి నిర్భయ కేసులో శిక్షపడినా మన పోలీసులు స్పందించరేమి?

# దామరమడుగులో జూనియర్ కాలేజి!

## భవన నిర్మాణానికి ముందుకొచ్చిన కొండా చంద్రమోహన్‌రెడ్డి

విద్యార్థుల ఇబ్బందులను గమనించి దామరమడుగులో ప్రభుత్వ జూనియర్ కళాశాల భవన నిర్మాణానికి 30 లక్షల రూపాయల ఆర్థిక సహాయం ప్రకటించి తన దాతృత్వాన్ని చాటుకొన్నారు ప్రముఖ కాంట్రాక్టర్ కొండా చంద్రమోహన్‌రెడ్డి. ఈ ప్రాంతంలో చాలాకాలం క్రిందట ప్రభుత్వ జూనియర్ కళాశాల ఏర్పాటైనా తగిన భవనంలేక స్థానిక ప్రభుత్వ పాఠశాలలో నడుస్తోంది. ఒకవైపు పాఠశాల, మరోవైపు అందులోనే జూనియర్ కళాశాల నిర్వహించాల్సి రావడంతో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. దీనిపై గ్రామస్తులు పలుమార్లు జిల్లా అధికారులను, ప్రజాప్రతినిధులను కలసి విన్నవించినా ఫలితం లేకుండా పోయింది. సమస్య వినేవాళ్లే తప్ప జూనియర్ కళాశాలకు ప్రత్యేక భవనం ఏర్పాటయ్యేందుకు ఎవరూ చొరవ చూపలేదు. ఈ పరిస్థితుల్లో గ్రామ పెద్దలు చొరవచూపి దాతల సహకారం తీసుకొన్నారు. విద్యార్థులకు ఉపయోగపడే కార్యక్రమం కావడంతో కొండా చంద్రమోహన్‌రెడ్డి ముందుకు వచ్చి తన తండ్రి కొండా కోటారెడ్డి పేరుతో భవన నిర్మాణానికవసరమైన 30 లక్షల రూపాయలు ఇస్తానని ప్రకటించడంతో గ్రామంలో సంతోషం వ్యక్తమవుతోంది. విద్యార్థులు, గ్రామస్తులు కొండా దాతృత్వాన్ని ప్రశంసిస్తున్నారు. ఈ నిధులతో పాఠశాల వెనుకవైపునే వున్న పొలాన్ని కొనుగోలు చేసి అందులో భవనాన్ని నిర్మించేందుకు సంసిద్ధులవుతున్నారు.



బదిలీపై వెళ్తున్న ఎసిబి ప్రత్యేక కోర్టు న్యాయమూర్తి వెంకటరమణను సన్మానిస్తున్న బార్ అసోసియేషన్ కార్యదర్శి ఇవి రామిరెడ్డి, తదితరులు.



సమైక్య శంఖారావం బస్సు యాత్రలో భాగంగా కావలి వచ్చిన వైకాపా నాయకురాలు షర్మిల ఆ పార్టీ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఇంట్లో బసచేసిన సందర్భంగా వారి కుటుంబసభ్యులతో ఫోటో దిగిన దృశ్యం.



కావలి తుమ్మలపెంటలోని దళితవాడలో ఏర్పాటు చేసిన గణేషునికి పూజా కార్యక్రమాలు నిర్వహిస్తున్న ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు.

● బోగోలులో

# దళిత గిరిజనుల సమైక్య ర్యాలీ!

### జిల్లాలో మొట్టమొదటిది

సమైక్యాంధ్రను కోరుకొంటూ, కేంద్ర ప్రభుత్వం తీసుకొన్న రాష్ట్ర విభజన నిర్ణయాన్ని నిరసిస్తూ బోగోలు మండలంలో దళిత, గిరిజనులు పెద్ద ఎత్తున ర్యాలీ నిర్వహించారు. మండలంలోని వివిధ ప్రాంతాల నుంచి అధిక సంఖ్యలో జనం తరలిరావడంతో మండల కేంద్రమైన బోగోలు జనసంద్రంగా మారింది. జై సమైక్యాంధ్ర అని నినదించిన ఉద్యమకారులు కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి దిష్టిబొమ్మను దగ్ధం చేసి తమ నిరసనను తెలియజేశారు. రాష్ట్రంలోని తెలుగు ప్రజలందరూ కలిసి వుంటేనే అభివృద్ధి సాధ్యమవుతుందని ఈ ర్యాలీకి నాయకత్వం వహించిన దళిత, గిరిజన వేదికల నాయకులు మల్లి, వెంకటపతిలు అభిప్రాయపడ్డారు. రాష్ట్రాన్ని విడగొట్టాలని తలచిన కేంద్రంలోని యుపిఏ ప్రభుత్వం, అందుకు సహకరిస్తున్న ఇతర పార్టీలు అడ్రసులు వచ్చే ఎన్నికల్లో గల్లంతవుతాయన్నారు. ప్రతి రాజకీయ నేత, ప్రజాప్రతినిధి సమైక్యాంధ్ర ఉద్యమంలో పాలుపంచుకోవాలని, రాష్ట్ర విభజనకు అడ్డుకట్ట వేసి భావితరాలను కాపాడాలని కోరారు. అనంతరం మానవహారం నిర్వహించారు. ఈ నిరసన కార్యక్రమంలో శ్యాంసుధాకర్, మాధవరావు, మురళి, సత్యవతి తదితరులు పాల్గొన్నారు.



# రాజన్న దళం స్కూటర్ ర్యాలీ!

### సమైక్యాంధ్రకు మద్దతు

కలిగిరి మండలంలో సమైక్యాంధ్రకు మద్దతుగా రాజన్న దళం ఆధ్వర్యంలో స్కూటర్ ర్యాలీ జరిగింది. రాజన్న దళం పేరుతో ప్రత్యేకంగా రాజకీయాలు నిర్వహిస్తున్న మెట్టుకూరు చిరంజీవిరెడ్డి తన అనుచరులతో భారీగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. సోనియాగాంధీ తన స్వార్థం కోసం రాష్ట్ర విభజనకు తెరతీసిందన్నారు. తెలుగు ప్రజల హృదయాలు గాయపడేలా విభజనకు కేంద్ర ప్రభుత్వం చొరవ చూపడం దారుణమైన చర్య అన్నారు. కేంద్రం తన నిర్ణయాన్ని ఉపసంహరించుకోనంత వరకు అందరూ కలసికట్టుగా పోరాడాలని పిలుపునిచ్చారు. సమైక్యాంధ్ర కోసం ఉద్యమించేవారికి పూర్తి సహాయసహకారాలు అందిస్తామని హామీ ఇచ్చారు. కలిగిరి నుంచి సీతారామపురం మీదుగా ఉదయగిరి వరకు స్కూటర్ ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా కలిగిరిలో ఉపాధ్యాయ జెఎసి చేపట్టిన రిలే నిరాహార దీక్షలకు మద్దతు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో రాజన్న దళం నాయకులు మాలేపాటి వెం కటసుబ్బయ్య, రంగారావు, అమరజీవిరెడ్డి, మస్తాన్‌రెడ్డి, సుబ్బారెడ్డి, ప్రసాద్, వెంకటేశ్వర్లు, భూపతి మాల కొండయ్య తదితరులు పాల్గొన్నారు.

# వెంకటగిరిలో సమైక్యాంధ్ర ఉద్యమ హోరు!

### ఎటుచూసినా ధర్నాలు, ప్రదర్శనలు

వెంకటగిరిలో సమైక్యాంధ్ర ఉద్యమం రోజురోజుకు ఉధృతం అవుతోంది. విద్యార్థులు, వివిధ సంఘాలు కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ నిరసన కార్యక్రమాలతో హోరెత్తిస్తున్నాయి. ధర్నాలు, రాస్తారోకోలతోపాటు వివిధ రూపాల్లో ఆందోళన కార్యక్రమాలు చేపడుతున్నారు. స్థానిక ఆర్‌విఎం ఉన్నత పాఠశాలను మూసివేసిన ఉపాధ్యాయులు, విద్యార్థులు దీక్ష చేస్తున్నారు. ప్రైవేటు పాఠశాలల నిర్వాహకులు ఈ ఉద్యమంలో పాలుపంచుకొంటున్నారు. బొమ్మల సంఘం ఇటీవల జరిపిన కొవ్వొత్తుల ర్యాలీ ప్రజలను ఆకట్టుకొంది. బలిజ సంఘం ఆధ్వర్యంలో జరిగిన ర్యాలీలో టమటం హనుమంతరావు శ్రీకృష్ణదేవరాయల వేషధారణతో పాల్గొనడం ప్రత్యేకంగా కన్పించింది. ఒకవైపు భారీగా జరిగిన ఈ ర్యాలీలో విద్యార్థి, ఉపాధ్యాయ జెఎసి తోపాటు ప్రజలు స్వచ్ఛందంగా పాల్గొనడంతో వెంకటగిరి పట్టణం జనసంద్రంగా మారింది.

# చదువుల గూర్చి ఆందోళన వద్దు!

### విద్యార్థుల తల్లిదండ్రులకు డిఇఓ భరోసా



సమైక్యాంధ్ర ఉద్యమాల కారణంగా విద్యా సంస్థలు మూత పడడంతో పిల్లల చదువు దెబ్బతింటున్నదన్న ఆందోళనను విద్యార్థుల తల్లిదండ్రులు విడిచిపెట్టాలని, సెలవుల్లోనూ పాఠశాలలు నిర్వహించి విద్యాబోధనకు ఆటంకం కలుగకుండా చూస్తామని జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం హామీ ఇచ్చారు. విద్యాశాఖ ఆధ్వర్యంలో కావలి పట్టణంలో జరిగిన సమైక్యాంధ్ర కార్యక్రమంలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. విద్యార్థులు, ఉపాధ్యాయులు, స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలు పాల్గొన్న కార్యక్రమాన్ని ఉద్దేశించి ఆయన ప్రసంగించారు. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలు, ముఖ్యంగా సీమాంధ్ర ప్రాంత ప్రజల మనోభావాలు తెలుసుకోకుండా కేంద్రం తొందరపడిందని, కొన్ని రాజకీయ పార్టీలు లేఖ ఇచ్చి అందుకు మద్దతు పలకడం వల్లనే ఈ సమస్య తలెత్తిందన్నారు. రాష్ట్ర విభజన వల్ల భావితరాలకు అన్యాయం జరుగుతుందన్నారు. ప్రధానంగా నీటి సమస్య, విద్యుత్, ఉద్యోగాలు, ప్రాంతాల అభివృద్ధి సమస్యలు తలెత్తుతాయన్నారు. దీంతో తెలుగు ప్రజలు నిత్యం కొట్టుకొనే పరిస్థితి ఏర్పడుతోందన్నారు. ఈ ప్రమాదాన్ని గుర్తించి అన్ని రాజకీయ పార్టీలు వారి సిద్ధాంతాలు, అజెండాలను ప్రక్కనపెట్టి అందరు సమైక్యాంధ్రకు మద్దతు ప్రకటించాలని,రాష్ట్ర విభజనను అడ్డుకోవాలని పిలుపునిచ్చారు. కావలి ఆర్డీఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి మాట్లాడుతూ రాష్ట్ర విభజన వల్ల భావితరాల భవిష్యత్తు అంధకారం అవుతుందన్నారు.

# వెంకటాచలంపై కరుణ చూపిన వరుణుడు!

### పెరిగిన భూగర్భ జలమట్టం

నిన్నమొన్నటి వరకు నీటి ఎద్దడిని ఎదుర్కొన్న వెంకటాచలం మండలంలో ఇప్పుడా సమస్య తీరింది. ఇటీవల కురిసిన వర్షాలు భూగర్భజలాల్లో నీటిమట్టం పెరగడం తదితర కారణాలతో ప్రజలకు నీటి సమస్య తప్పింది. గత కొన్నేళ్లుగా బావుల్లో నీరు లేక, చెరువులకు నీరు చేరక, వర్షాలు సరిగా పడక మండలంలోని ప్రజలు నీటి ఎద్దడిని ఎదుర్కొంటున్నారు. సర్వేపల్లి, తిక్కవరప్పాడు, ఇస్కపాళెం, కాకర్లవారిపాళెం, ముత్యాలగుంట, జోసఫ్‌పేట, లింగంగుంట, గొలగమూడి గ్రామాల్లో నీటి కొరత వుండేది. మండల అధికారులు, గ్రామీణ నీటిపారుదల శాఖ అధికారులు ప్రజల మంచినీటి సమస్యను పరిష్కరించేందుకు నానాతంటాలు పడుతున్నారు. వినాయక చవితి లాంటి పండుగల సమయాల్లో విగ్రహాలను నిమజ్జనం చేసేందుకు వీలుకాని పరిస్థితి వుండేది. ప్రస్తుతం ఈ సమస్య తీరింది. పలు ప్రాంతాల్లోని చెరువులు, బావుల్లో పుష్కలంగా నీరు వచ్చి చేరడంతో ప్రజలు సంతోషం వ్యక్తం చేస్తున్నారు. మూగజీవాలకూ దాహార్తి తీరనుంది.

# చంద్రబాబుది దుర్మార్గపు చర్య!

### రాష్ట్ర విభజనకు లేఖ ఇచ్చాడని విమర్శించిన ఎమ్పీ



రాష్ట్ర విభజనకు అనుకూలంగా లేఖ ఇచ్చిన తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబు నాయుడు దుర్మార్గుడని ఎంపి మేకపాటి రాజమోహన్‌రెడ్డి అభివర్ణించారు. సమైక్య శంఖారావంలో భాగంగా బుచ్చిరెడ్డిపాళెంలో జరిగిన సభలో ఆయన పాల్గొని ప్రసంగించారు. తాత్కాలిక ప్రయోజనాల కోసం కాంగ్రెస్ ఢిల్లీ పెద్దలు రాష్ట్రాన్ని విభజించాలని కుట్ర పన్నితే, దానికి లేఖ ఇచ్చి చంద్రబాబు సహకరించారన్నారు. తొమ్మిదేళ్లు ముఖ్యమంత్రిగా రాష్ట్రాన్ని పాలించిన చంద్రబాబు నాయుడు ఈ పని చేయడం సిగ్గు చేటన్నారు. రాష్ట్రం రెండుగా విడిపోతే సీమాంధ్ర ప్రాంత ప్రజల ప్రయోజనాలు పూర్తిగా దెబ్బతింటాయన్నారు. కాంగ్రెస్ ప్రభుత్వ నిర్ణయంతో సీమాంధ్ర ప్రజలు భగ్గుమనడంతో చంద్రబాబు మనసు మార్చుకొని ఆత్మగౌరవ యాత్ర పేరుతో డ్రామాలాడుతున్నారని దుయ్యబట్టారు. రాష్ట్ర విభజనకు అంగీకరిస్తూ ఇచ్చిన లేఖను వెనక్కు తీసుకొన్న తర్వాతే బాబు సీమాంధ్ర యాత్ర చేయాలని సూచించారు. రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచేందుకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పోరాటం చేస్తున్నాదన్నారు. రాజకీయ మనుగడ కోసం ఇతర పార్టీలతో లింకులు పెట్టుకొనే అలవాటు చంద్రబాబు నాయుడుదని కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విమర్శించారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీపై తెలుగుదేశం పార్టీ, చంద్రబాబు నాయుడు చేస్తున్న విమర్శలను ప్రజలు నమ్మరన్నారు. అలాంటి లింకులే పెట్టుకొని వుంటే జగన్ జైల్లో ఎందుకు వుంటాడని ఎదురు ప్రశ్నించారు. చంద్రబాబు చేపట్టిన ఆత్మగౌరవ యాత్రను శవయాత్రగా ప్రసన్న వర్ణించారు.



సమైక్యాంధ్రకు మద్దతుగా 'కావలికేక' కార్యక్రమంలో భాగంగా ఉదయగిరి రోడ్డు సెంటర్‌లో ఏర్పాటుచేసిన తెలుగుతల్లి కటౌట్.

● వెంకటగిరి

# తెలుగు తమ్ముళ్లలో గొడవలు!

## చిచ్చు పెట్టిన కొమ్మి

వెంకటగిరి నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీ నుంచి వలసలు అధికం అయ్యాయి. గత కొంతకాలంగా తెలుగుదేశం పార్టీలో ముఖ్యులుగా పేరుపడ్డ నేతలు ఇతర పార్టీల్లోకి వెళ్తుండడం నియోజకవర్గంలో చర్చనీయాంశ మయ్యింది. బాలాయపల్లికి చెందిన తెలుగుదేశం పార్టీ సీనియర్ నేత రాయి రమేష్ నాయుడు ఆ ప్రాంతంలో కీలకంగా వ్యవహరించడమేకాక, పార్టీ జిల్లా కార్యనిర్వాహక కార్యదర్శిగా వున్నారు. అలాంటి వ్యక్తి ఇటీవల జరిగిన సర్పంచ్ ఎన్నికల్లో స్థానిక ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణతో విభేదించి తిరుగుబాటు అభ్యర్థిగా బరిలో నిలిచారు. ఎన్టీరామా రావు, చంద్రబాబునాయుడుకు ముఖ్య అనుచరునిగా వున్న రాయి వెంకటయ్య చౌదరి కుమారుడే రమేష్. మండలంలో ఆ పార్టీకి బలమైన నేతగా వున్న ఆయన వైఎస్.రాజ శేఖర్‌రెడ్డి వర్ధంతి కార్యక్రమానికి వైకాపా నేత, నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్యనాయుడుతో కలసి హాజరుకావడం చర్చనీయాంశమయ్యింది. అలాగే బాలా యపల్లి మండలానికి చెందిన మరో టిడిపినేత గూడూరు భాస్కర్‌రెడ్డి సైతం ఇటీవల వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరారు. పలువురు టిడిపి నేతలు పార్టీ వీడుతుంటే, మరో వైపు టిడిపి జిల్లా ఉపాధ్యక్షుడు, సీనియర్ నేత చెలికం శంకర్‌రెడ్డి ఇటీవల ఎమ్మెల్యే చేప ట్టిన దీక్షలకు హాజరుకాకపోవడం పార్టీలోని నేతల మధ్య నెలకొన్న లుకలుకలు బయట పడినట్లయ్యాయి.

# సమస్యల సుడిగుండంలో వెంకటగిరి ప్రజలు!

## పరిష్కరించేవారేరి?

వెంకటగిరి పట్టణంలో సమస్యలు ప్రజలను ఇబ్బందులకు గురిచేస్తున్నాయి. ప్రధానంగా తాగునీటి సమస్య చాలాకాలంగా ప్రజలను పట్టి పీడిస్తోంది. ప్రజలు దాహార్తి తీర్చమని అధికారులకు, ప్రజాప్రతినిధులకు మొర పెట్టుకొంటే సమ్మర్ స్టోరేజి ట్యాంకు పనులు పూర్తయితే ఇక మంచినీటి సమస్యే వుండదని ఉత్తుత్తి హామీలు ఇవ్వడం తప్ప త్రాగునీటి సమస్యకు పరిష్కారం చూపకపోవడంతో పురప్రజలు మంచినీటికి ఇక్కట్లు ఎదుర్కోవలసి వస్తోంది. మరోవైపు పారిశుధ్యం పూర్తిగా క్షీణించింది. మురుగుకాలువలు ఆక్రమించి నిర్మాణాలు చేపట్టడంతో మురుగునీరు పోయే వీలు లేక ఎక్కడికక్కడ నిలచి రోడ్లపైకి వచ్చేస్తుండడంతో పరిస్థితి అస్తవ్యస్తంగా మారింది. చెత్తా చెదారాలు సక్రమంగా ఎత్తకపోవడంతో దోమలు పెరిగిపోయాయి. కనీసం దోమల నివారణకు మునిసిపాలిటీ ఎలాంటి చర్యలు చేపట్టకపోవడం విమర్శల పాలవుతోంది. ఫాగింగ్ మిషన్లు అందుబాటులో వున్నా ఫాగింగ్ చేయకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నా రని ప్రజలు ఆగ్రహిస్తున్నారు. దీనికి తోడు పట్టణంలోని పలు ప్రాంతాల్లో వీధి దీపాలు వెలగక చీకటి అలుముకొని వుంటోంది. ఈ పరిస్థితుల్లో వెంకటగిరి గ్రామ దేవత పోలే రమ్మ జాతర సెప్టెంబర్ 25, 26 తేదీల్లో జరగనుంది. జిల్లా నలుమూలల నుంచి అధిక సంఖ్యలో భక్తులు వచ్చి పోలేరమ్మ దర్శనం చేసుకొంటుంటారు. దీనిని దృష్టిలో వుంచు కొని మున్సిపల్ అధికారులు పారిశుధ్య పరిస్థితులు మెరుగుపరచాలని, మంచినీటి సమస్యను పరిష్కరించి, దెబ్బతిన్న రోడ్లకు మరమ్మత్తులు చేసి భక్తులకు ఎలాంటి ఇబ్బంది కలుగకుండా చూడాలని స్థానికులు కోరుకొంటున్నారు.

● తెలుగు ప్రజల్లో

# విభజన చిచ్చు రేపింది వైఎస్!

పచ్చగా వున్న తెలుగు ప్రజల్లో చిచ్చు రేపింది, రాష్ట్ర విభజనకు కారణమయ్యింది వైఎస్.రాజశేఖర్‌రెడ్డే నని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర ఆరో పించారు. అల్లూరు మండలంలో తెలుగుదేశం పార్టీ ఆధ్వ ర్యంలో స్కూటర్ ర్యాలీ నిర్వహించారు. బీరంగుంట వద్ద నుంచి బారులు తీరిన ర్యాలీ అల్లూరు పాత బస్టాండ్ సెంటర్‌లోని అంబేద్కర్ విగ్రహం వరకు సాగింది. ఈ సందర్భంగా బీద రవిచంద్ర మాట్లాడుతూ 1999లో తెలంగాణ చిచ్చురేపింది రాజశేఖర్‌రెడ్డని, ఆయన తన స్వార్ధ రాజకీయాల కోసం 40 మంది ఎమ్మెల్యేలను ఢిల్లీ పంపి తెలంగాణ ఏర్పాటు చేయా లని మంట రగిలించారన్నారు. వైఎస్ సతీమణి విజయమ్మ, ఆయన కుమార్తె షర్మిల మహబూబ్‌నగర్‌లో తెలంగాణకు అను కూలంగా వ్యాఖ్యానించి, ఇప్పుడు మాట మార్చారన్నారు. అలాంటివాళ్లు ఇప్పుడు తమ పార్టీ అధినేత చంద్రబాబు నాయుడుపై విమర్శలు చేయడం సిగ్గుచేటన్నారు. దీనిపై వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలు ఆత్మ పరిశీలన చేసుకోవా లన్నారు. హైదరాబాద్‌లో ఎన్జీఓలు జరిపిన సభతోనైనా కేంద్ర మంత్రులకు కనువిప్పు కలగకపోవడం దారుణమన్నారు.

**టిడిపి జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర**

తెలంగాణ నేతలకు ఈ సభ ఒక గుణపాఠమన్నారు. కేంద్ర ప్రభుత్వం రగిలించిన రాష్ట్ర విభజన చిచ్చువల్ల రాష్ట్రం అగ్ని గుండంగా మారిందని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్ రావు విమర్శించారు. ప్రజలు 40 రోజులకుపైగా రోడ్లపైకి వచ్చి నిరసన కార్యక్రమాలు చేపట్టాల్సిన పరిస్థితులు నెలకొన్నా యన్నారు.



● సూర్యభగవానుని

# ఆరాధనతో ఆరోగ్యం, ఐశ్వర్యం!

సకల జగత్తుకు వెలుగు ప్రదాత సూర్యభగవానుడు. ఆయన్ను ప్రత్యక్ష నారాయణుడిగా భావిస్తూ ఆరాధించడం హిందువులలో అనాదిగా వస్తున్న సాంప్రదాయం. ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని ప్రసాదించే సూర్య భగవానుడిని కొలవని వారంటూ వుండరు. సకల జీవరాశికి ప్రాణదాతలైన సూర్యుడు నిస్వార్థ కర్మకు నిలువెత్తు రూపం. సర్వ సమానత్వానికి ప్రతీక. పూరి గుడిసె అయినా, రాజప్రసాదమైనా ఒకేరకంగా వెలుగు కిరణాలను ప్రసరిస్తాడు. సూర్యోపాసన చేయడం ద్వారా సర్వరుగ్మతలు తొలగుతాయని, సకల విద్యాబుద్ధులు, జ్ఞాన వృద్ధి కల్గుతుందంటారు. సమస్త జీవరాశుల్లో చైతన్యం నింపడంతోపాటు మానవాళికి వెలుగు రేఖలను ప్రసాదించే భగవానుడు. వేద విద్యా శాస్త్ర పారంగతుడైన సూర్యుడిని అర్చిస్తే చక్కని విద్యాబుద్ధులు అబ్బుతాయంటారు. ఆంజనేయుడు సూర్యుని వద్దే సకల శాస్త్రాలను అభ్యసించిన విషయం తెలిసిందే.

సూర్యభగవానుడు నమస్కార ప్రియుడు. ఎలాంటి నియమనిబంధనలు లేకుండా రెండు చేతులు జోడించి నమస్కరిస్తే పొంగిపోయి భక్తుల కోర్కెలను తీర్చే వర ప్రదాత. సంపూర్ణ ఆరోగ్యానికి, సకల శుభాలకు సూర్యోపాసనను మించింది లేదని శాస్త్రాలు చెబుతున్నాయి. స్త్రీలకు సౌభాగ్యాన్ని, ఐశ్వర్యాన్ని ప్రసాదించే సూర్య భగవానుడిని ఆరాధిస్తే సకల దేవతలను అర్చించినట్లేనని శాస్త్ర వచనం. భక్తసులభుడైన ఆదిత్యుని ఆరాధించడం వల్ల ఆరోగ్యం పెంపొందడంతోపాటు చైతన్యం కల్గుతుంది. అందుకే సూర్యోదయానికి ముందే లేచి కాలకృత్యాలు తీర్చుకొని సూర్యోపాసన చేయమని పెద్దలు చెబుతుంటారు. సకల జీవరాశికి ప్రాణాధారం, సకల జగత్తుకు మార్గదర్శకుడైన సూర్యభగవానుడు సేవలు అనన్య సామాన్యం. నిత్యం ఆదిత్య హృదయం చదవడం వల్ల అన్నిరకాలుగా మేలు జరుగుతుందని పురాణాలు చెబుతున్నాయి. రావణాసురుడితో యుద్ధం చేసే సమయంలో శ్రీరాముడు ఆదిత్య హృదయం చదవడం ద్వారా విజయం సాధించాడని పురాణ కథనం. అలాగే అరణ్యవాస సమయంలో ధర్మరాజు సూర్యుడిని ప్రార్థించి అక్షయ పాత్ర పొందాడని, సత్రాజిత్తుకు ఆదిత్యుని అర్చించడం వల్ల శమంతకమణి లభించిన విషయాన్ని పురాణాలు తెలియజేస్తున్నాయి. శుక్ల యజుర్వేదం సూర్యభగవానుడిని ఆరోగ్య ప్రదాతగా శ్లాఘిస్తోంది. అలాంటి సూర్యభగవానుడిని నిత్యం ఆరాధించడం వల్ల ఆరోగ్యం, ఐశ్వర్యం లభిస్తాయి.

తప్పడు సమాచారం

● ఇసుక అక్రమ రవాణాపై

# పోలీసులను ప్రక్కదారి పట్టిస్తున్న ఇన్‌ఫార్మర్!

**కావలి, కప్పరాళ్లతిప్ప, దగదర్తి పోలీసులు ఇసుక అక్రమ రవాణా గూర్చి సమాచారం అందించేందుకు ఏర్పాటు చేసుకున్న ఇన్‌ఫార్మర్ తానే పెద్ద ఇసుక స్మగ్లర్‌గా మారడం ఈ ప్రాంతంలో చర్చనీయాంశమయ్యింది.**

పోలీసులకు ఇన్‌ఫార్మర్‌గా వ్యవహరిస్తున్న వ్యక్తి బాగా చేతివాటం ప్రదర్శిస్తున్నాడు. కావలి, కప్పరాళ్లతిప్ప, దగదర్తి పోలీసులు ఇసుక అక్రమ రవాణా గురించి సమాచారం అందించేందుకు ఒక ఇన్‌ఫార్మర్‌ను ఏర్పాటు చేసుకున్నారు. ఇన్‌ఫార్మర్‌గా వ్యవహరించే వ్యక్తి ఇతరుల లారీలు, ట్రాక్టర్లను పోలీసులకు పట్టిస్తూ తన ట్రాక్టర్ ద్వారా ఇసుకను అక్రమంగా రవాణా చేస్తున్నాడు. ఈ విషయం సంబంధిత పోలీసులకు తెలిసినా ఇన్‌ఫార్మర్‌గా వుండడంతో పట్టించుకోవడం లేదన్న ఆరోపణలున్నాయి. పోలీసులకు లారీలు, ట్రాక్టర్ల గురించి సమాచారం చేరవేసే వ్యక్తి ఇసుక అక్రమ రవాణాలో ఆరితేరాడు. ఇతన్ని ఇన్‌ఫార్మర్‌గా నియమించుకోవడంపై అనేక విమర్శలు వినిపిస్తున్నాయి. పోలీసుల సహకారం వుండడంతో ఇతని వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలుగా విరాజిల్లుతోంది.

ప్రస్తుతం జిల్లావ్యాప్తంగా రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేస్తూ ప్రభుత్వ శాఖల ఉద్యోగులు విధులను బహిష్కరించి సమ్మె చేస్తున్నారు. ఇదే అదునుగా భావించిన ఇసుక మాఫియా లారీలు, ట్రాక్టర్ల ద్వారా ఇసుక అక్రమ రవాణాకు శ్రీకారం చుట్టారు. సంబంధిత శాఖ అధికారుల తనిఖీలు లేకపోవడం వారికి బాగా కలిసి వస్తుంది. జిల్లా నుండి ఇతర జిల్లాలకు ఇసుక తరలించేందుకు ఇబ్బంది లేకుండా చేసుకోగలుగుతున్నారు. పోలీసులు ఏర్పాటు చేసుకున్న ఇన్‌ఫార్మర్లు సమాచారం అందిస్తేనే తప్ప జాతీయ రహదారిపై వాహనాలను తనిఖీ చేసే అవకాశం వుండదు. కొన్ని వాహనాలను మాత్రమే పట్టుకుని మిగిలిన వాహనాలను వదిలేస్తుండడంతో పోలీసుల పనితీరుపై విమర్శలు వస్తున్నాయి.

ఇటీవల సున్నపుబట్టి సమీపంలో జాతీయ రహదారిపై నాలుగు ఇసుక లారీలను పోలీసులు పట్టుకున్నారు. గస్తీ నిర్వహిస్తున్న పోలీసులు పట్టుబడిన లారీల డ్రైవర్లను నగదు డిమాండ్ చేసినట్లు సమాచారం. వాహనాలకు అన్ని ధృవీకరణ పత్రాలు సక్రమంగా ఉన్నప్పటికీ అధిక లోడును సాకుగా చూపి వేలల్లో నగదు డిమాండ్ చేశారట. లారీలను పట్టుకున్న విషయంపై బుచ్చి, దగదర్తి ఎస్‌ఐలు ఒకరిపై ఒకరు చెప్పుకొంటున్నారు. బుచ్చి పోలీసులు లారీలను పట్టుకున్నారని దగదర్తి ఎస్‌ఐ చెబుతుండగా, అధిక లోడు వుండడంతో నాలుగు లారీలను దగదర్తి పోలీస్‌స్టేషన్‌లో అప్పగించడం జరిగిందని బుచ్చి ఎస్‌ఐ వివరణ ఇచ్చారు. అయితే లారీ డ్రైవర్లు, క్లీనర్లు మాత్రం నగదు కోసం పోలీసులు తీవ్ర ఇబ్బందులకు గురి చేశారని వాపోయారు. అధిక లోడుతో వెళుతున్న వాహనాలు పట్టుబడితే రవాణా శాఖ అధికారులకు అప్పగించాలన్న విషయం పోలీసులు మరిచి పోవడం విశేషం.

జాతీయ రహదారిపై వెళుతున్న వాహనాల నుండి మామూళ్లు వసూలు చేయడాన్ని నియంత్రించలేక పోతున్నారు పోలీసు అధికారులు. కావలి నుంచి తడ వరకు జాతీయ రహదారిని ఆనుకుని వున్న పోలీస్‌స్టేషన్ల సిబ్బంది తనిఖీల పేరుతో అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్నారు. ప్రధానంగా ఇసుకను అక్రమంగా తరలించే వాహన యజమానులు నెలవారి మామూళ్లు ఇచ్చే విధంగా ఒప్పందం చేసుకుంటున్నారు. ఒప్పందం చేసుకోని వారి వాహనాలను మాత్రమే కాపుకాసి పట్టుకుంటుంటారు. ఇందుకు ఇన్‌ఫార్మర్లు బాగా సహకరిస్తుంటారు. నెలవారి మామూళ్లు వసూలు చేసే బాధ్యతను కూడా అనుకూలంగా వుండేవారికి అప్పగిస్తున్నారు. మొత్తం మీద పోలీసు శాఖ గాడి తప్పిందని చెప్పవచ్చు. శాంతి భద్రతలను గాలికొదిలేసి ఎక్కడ మామూళ్లు వస్తాయో అక్కడే పోలీసులు ప్రత్యక్షమై వివిధ రకాల తనిఖీలతో ఇబ్బంది పెట్టడాన్ని ఎస్పీ గారు నియంత్రించాల్సిన అవసరం వుంది.

# సణుగుడు

## * డిజిపి దినేష్‌రెడ్డి అనుచిత అసహనం - హిందూ సంపాదకుడి అసమాన స్థైర్యం!

డిజిపి దినేష్‌రెడ్డి అంటే నాకు గౌరవభావం. ఐపిఎస్ అధికారిగా 36 ఏళ్లపాటు నీతి నిబద్ధతలకు కట్టుబడడం ఏ కొద్దిమందికో సాధ్యం. ఆ కొందరిలో దినేష్‌రెడ్డి ఒకరు. వృత్తి పరమైన విషయాలలో ఆయన ఎవరి మాటా వినడు. ఎవరి ప్రలోభాలకు, పలుకుబడులకు లొంగడు. అట్లని పోలీస్ కాఠిన్యం లేదు. మాట సుతిమెత్తగా వుంటుంది. ఆయన నోటి వెంట పరుషమైన పదజాలం నేనెప్పుడూ వినలేదు. తన స్వంతం కోసం తన అధికారాన్ని వాడిన సాదృశ్యం లేదు. తన కుటుంబం కోసం తన హోదాను అడ్డుపెట్టు కొన్న ఉదాహరణ లేదు. ఆయనకు బంధు గణం జాస్తి. హైదరాబాదులో స్థిరపడి, స్థితిమంతులైన అసంఖ్యాక నెల్లూరు పెద్ద రెడ్లకు ఆయనకు దగ్గరి చుట్టరికం ఉంది. కానీ ఏ ఒక్కరు కూడా ఆయన మా వాడని చెప్పుకోరు. అందుకు కారణం – వారడిగే అడ్డదుడ్డమైన పనులకు ఆయన సహకారం లభించక పోవడం మాత్రమే.

**డోలేంద్ర**

చాలా మంది ముఖ్యమంత్రులతో ఆయనకు సన్నిహిత సంబంధాలున్నాయి. కానీ ఒక జీవితకాలం పాటు ఆయన్ను అందరు ముఖ్యమంత్రులూ లూప్ లైన్‌లో పెట్టారే తప్ప కీలక పోస్టింగులు ఇవ్వలేదు. అందుకు కారణం – దినేష్‌రెడ్డి తాము ఆడమన్న ఆట ఆడడన్న అనుమానం. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కూడా ఆయన్ను అతి కొద్ది కాలం మాత్రమే సిటీ పోలీస్ కమిషనర్‌గా కొనసాగించాడు. దినేష్‌రెడ్డి సలహా ప్రకారం పోలీస్ శాఖ పోస్టింగులు వేసిన రాజశేఖర్‌రెడ్డి, దినేష్‌రెడ్డి స్వంతానికి వచ్చే సరికి లూప్ లైన్ ఎంచుకొన్నాడు. నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు కూడా అంతే. ఇంటెలిజెన్స్ డిఐజితో సరి పెట్టాడు. చంద్రబాబు నాయుడు అయితే తాను పదవిలో వున్న తొమ్మిదేళ్ల కాలం దినేష్‌రెడ్డిని అత్యంత అప్రధాన పోస్టులకు పరిమితం చేశాడు. మరొకరైతే అంత సుదీర్ఘకాలం తెరమరుగులో కాలం గడపవలసి వచ్చిందనే నైరాశ్యంతో ఆయా నేతల ముందు సాగిల పడి ఉండేవారు. కానీ దినేష్‌రెడ్డి ఓర్పు కోల్పోలేదు.

అంత సహనం, అంత నిగ్రహం కల్గిన దినేష్‌రెడ్డి తన అధికార జీవిత చరమాంకంలో అసహనపరుడిగా పేరు తెచ్చుకోవడం బాధ కల్గిస్తున్నది. డిజిపి అయిన ప్రక్క క్షణం నుంచి ఆయన కక్షబోతు ధోరణితో వ్యవహరిస్తున్నాడు. తనకు గిట్టని వారిని, తనను విమర్శించే వారిని, తనను తప్పుపట్టే వారిని వేధింపులకు గురిచేయడం ఒక దిన చర్యగా కొనసాగిస్తున్నాడు. కాంగ్రెస్ ఎమ్మెల్యే శంకర్‌రావు విషయం అందరికీ తెలిసిందే. అటువంటి ఉదాహరణలు లెక్కకు మించి ఉన్నాయి. ఎప్పుడో ఎన్నేళ్ల క్రితమో తాను చెప్పిన మాట వినలేదన్న కినుకతో, ఎస్ఐ, సిఐ వంటి చిన్న చిన్న పోలీసులను కూడా వెంటాడి వేధించాడన్న ఆరోపణ వుంది.

ఈ వైఖరికి పరాకాష్ట హిందూ దిన పత్రిక రెసిడెంట్ ఎడిటర్ ఎస్.నగేష్‌కుమార్ మీద తప్పుడు పోలీస్ కేసు. అంతకు క్రితం సంగతి నాకు తెలియదు కానీ డిజిపి అయిన తర్వాత దినేష్ రెడ్డిలో దైవభక్తి అమితంగా పెరిగిపోయింది. రాష్ట్రంలోని గుళ్లన్నీ కలియ తిరుగుతున్నాడు. కనిపించిన స్వామీజీలందరికీ సాగిల పడుతున్నాడు. హోమాలు, యాగాలు జరిపిస్తున్నాడు. అది ఆయన వ్యక్తిగత విషయం. దాన్ని ప్రశ్నించడానికి ఎవరికీ అధికారం లేదు. డిజిపి హోదాలో వున్నాడు కాబట్టి దేముళ్లను కొలవగూడదని, స్వామీజీలకు దండం పెట్టకూడదని ఏ చట్టంలోనూ లేదు. ఇదే అలవాటులో హైదరాబాద్ పాత బస్తీలోని ముస్లిం మత పెద్ద హబీబ్ ముస్తఫా ఇద్రుస్ బాబాను కలిశాడు. ఆ బాబాకు చాలా పేరు ప్రఖ్యాతులున్నాయి. ఎన్.డి.తివారీ, జాఫర్ షరీఫ్ వంటి ప్రముఖ నేతలతో పాటు అనేక మంది రాజకీయ, అధికార ప్రముఖులు ఆయన ఆశీర్వాదం తీసుకొంటూ వుంటారు. అందులో తప్పు లేదు. ఎవరి నమ్మకం వారిది. ఆ వార్తను హిందూ దిన పత్రిక ప్రచురించింది. బాబాను కలవ డానికి వెళ్లేటప్పుడు కొన్ని ఫైళ్లు చేత బట్టుకుని వెళ్లాడని వ్రాసింది. ఆ వార్తలో పరువు నష్టం కల్గించే వ్యాఖ్య లేదు. అప్రతిష్ట తెచ్చే మాట లేదు. కానీ దినేష్ రెడ్డి మాత్రం దాన్ని తీవ్రంగా పరిగణించాడు.

పత్రికలలో తమకు ఇష్టం లేని వార్తలు వస్తే సివిల్ కోర్టులలో పరువు నష్టం కేసు దాఖలు చేయడం ఒక్కటే చట్టంలో వున్న సదుపాయం. కానీ దినేష్‌రెడ్డి తన డిజిపి హోదాను అడ్డం పెట్టుకుని, హిందూ స్థానిక సంపాదకుడు ఎస్.నగేష్ కుమార్ మీద ఏకంగా దేశద్రోహం స్థాయి కేసు పెట్టించాడు. మాదాపూర్ ఎసిపి చేత ఎఫ్ఐఆర్ దాఖలు చేయించాడు.

హిందూకు పత్రికా లోకంలో ఎంత గౌరవ మర్యాదలున్నాయో అందరికీ తెలుసు. భారతీయ పత్రికా రంగానికి అదొక పూజ్యనీయ సంస్థ. పాత్రికేయ ప్రమాణాలు, సామాజిక బాధ్యతల విషయంలో వారు అత్యు న్నత విలువలు పాటిస్తారు. వారి వార్త లను వేలెత్తి చూపే మొనగాడు ఇప్పటి వరకు పుట్టలేదు. అటువంటి అవకాశం వారు ఇవ్వరు. హిందూ యాజమాన్యానికి పత్రికా ప్రచురణ ఒక వ్యాపారం కాదు. సామాజిక నిబద్ధత మాత్రమే. ప్రకటనల కోసం, పత్రిక అమ్మకాలు పెంచుకోవడం కోసం సంచలనాలకు పాల్పడే వ్యాపార వైఖరి వారిలోకాగడా పెట్టి వెతికినా కన్పించదు. అందువల్లనే ఒక్క భారత దేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా ఎందరో దేశాధినేతలు, కార్పొరేట్ దిగ్గజాలు, మేధావులు, పత్రికా రచయితలు, వివిధ రంగాల ప్రముఖులు హిందూను అభిమానిస్తారు. ఆరాధిస్తారు. నాబోటి పత్రికా రచయితలకు అదొక భగవద్గీత.

అటువంటి పత్రికా సంపాదకుడి మీద తప్పుడు కేసు బనాయించే నైచ్యానికి దినేష్‌రెడ్డి దిగజారాడంటే, ఆయనలో అధికార మత్తు ఎంతగా ఆవహించి ఉందో అర్థమై పోతున్నది. విద్యతో వినయం రావాలి. హోదాతో హుందాతనం పెరగాలి. చేపట్టే పదవులలో ఏ వ్యక్తి అయినా రాణించాలంటే అది తప్పనిసరి. కానీ దినేష్‌రెడ్డిలో ఆ సాంప్రదాయం కనుమరుగై అసహనం, కసి, కచ్చిబోతుతనం పెరిగిపోతున్నాయి. వాటిని తీర్చుకోవడానికి తన హోదా అడ్డు పెట్టుకొంటున్నాడు. తాత్కాలికంగా తనకు గిట్టని వారిని మట్టి కరిపించానన్న పైశాచిక ఆనందం ఆయనకు కలగవచ్చు. కానీ డిజిపి హోదా ఏళ్ల కాలం ఉండదు. రేపు కాకుంటే పై ఏడాదికి ఆయన రిటైర్ కాక తప్పదు. అప్పుడేమి చేస్తాడు?

అయితే హిందూ పత్రికా యాజమాన్యం మాత్రం ఈ విషయంలో అసాధారణ, అభినందనీయమైన పాత్రికేయ ప్రవృత్తి ప్రదర్శించింది. హిందూ దిన

కొరవ 14వ పేజీలో




తలపెట్టిన పనులలో శ్రద్ధ, మనోధైర్యం తగ్గుట, అనవసర కంగారు. నోటి దురుసుతనం వల్ల అయినవారితో విరోధాలు, శరీరారోగ్య లోపం, ఆరోగ్య విషయంపై అధిక ఖర్చు. వృత్తి, వ్యాపారాలలో ఆదాయం బాగుంటుంది. చిరు వ్యాపారులు ఇబ్బందులెదుర్కొంటారు. అనసర దిగులు, విచారాలుంటాయి. భార్య వర్గం వారిచే నిందలు. అన్ని రంగాల వారికి ప్రయత్న పూర్వకమైన ధన లాభం వుంటుంది.




నూతన వ్యాపకాలకై ఆలోచిస్తారు. ఉద్యోగులకు స్థాన చలనాలుంటాయి. మనోభీష్టం పొందుతారు. వ్యాపార భాగస్తులు లేదా కుటుంబ వ్యక్తుల మధ్య భేదాభిప్రాయాలుంటాయి. విభేదాలు రావచ్చు. అన్ని వర్గాల వారికి ధనాదాయం, కీర్తి, రాజయోగాలుంటాయి. తలపెట్టిన పనులు బంధుమిత్రులతో కలసి పూర్తి చేస్తారు. కోర్టు వ్యవహారాలు ఇబ్బంది పెడతాయి. అందరితో ఆచితూచి మాట్లాడాలి.




విఘ్నాలు కలిగినా కష్టం మీద పనులు పూర్తి చేస్తారు. పిల్లల విద్యా విషయంలో కీలక నిర్ణయాలు తీసుకొంటారు. సంతానం వల్ల కొంత ఒత్తిడి వుంటుంది. వ్యవసాయదారులకు దాన్య వృద్ధి. విద్యార్థులకు సుఖసంతోషాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగుల ఆర్థికస్థితి మెరుగౌతుంది. అవసరానికి రుణాలు చేస్తారు. పిల్లల వివాహ విషయాల చర్చలతో మానసిక వ్యధ వుంటుంది.




వృత్తి, వ్యాపారాలలో వేగం తగ్గించుట మంచిది. ఉద్యోగులకు చికాకులు, అధిక ప్రయాణాలు. అన్ని వృత్తుల వారికి సామాన్య ధన లాభం. ప్రయాణాలలో పలు జాగ్రత్తలు అవసరం. విలువగల వస్తువులు కొనుగోలు చేస్తారు. వ్యాపార భాగస్వాములతో అభిప్రాయ బేధాలుంటాయి. అవగాహనా లోపం వల్ల వ్యాపార స్తంభన, పరిష్కారానికి ప్రయత్న విఘ్నాలు ఏర్పడవచ్చు.




మనస్సులో ఆందోళన వున్నా పూర్వ పరిచయాలు కొంతమేర ఉపకరిస్తాయి. తలపెట్టిన పనులు ఆగడం ఒకందుకు మేలు. కుటుంబ వ్యవహార పరిష్కారాలకు మార్గాలు ఆలోచిస్తారు. కుటుంబ పెద్దలతోనూ, ఆత్మీయులతోనూ మీ విషయాలు పంచుకొంటారు. మనస్సు కుదుటపడుతుంది. స్థిరాస్తి విషయాలలో తగు జాగ్రత్తలు అవసరం. సోదర వర్గంతో కొన్ని ఇబ్బందులు రావచ్చు.




మిశ్రమ ఫలితాలుంటాయి. కొన్ని సందర్భాలు అనూహ్యంగా కలసి వస్తాయి. మరికొన్ని అంతేవాసిగా బెడిసికొడతాయి. కొన్ని విషయాలు మీ ప్రమేయం లేకుండానే జరిగిపోతాయి. దాయాది వర్గాలతో కొన్ని ఇబ్బందులెదుర్కొంటారు. మిశ్రమ ఆదాయంతో ముందుకెళ్తారు. అనారోగ్య బాధలు, అకారణ కలహాలేర్పడతాయి. విద్యార్థులు తగు జాగ్రత్తలు తీసుకోవడం అవసరం.

# వారఫలాలు

*తేది 21-9-2013 నుండి 27-9-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో రవి, 25తేది వరకు బుధుడు తదుపరి తులలో; తులలో శుక్ర, శని, రాహువులు; మీన, మేష, వృషభ, మిథునాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

21తేది ఉండ్రాళ్ల తద్దె.
22తేది సంకష్టహర చతుర్దశి.
23తేది భరణీ మహాలయం.
25తేది కపిల షష్టి.
26తేది వ్యతి పాన్మాలయం.
27తేది షిరిడి సాయి జన్మదినం, మద్వాష్టమి, రుద్రాష్టమి, హస్త కార్తె, గజగౌరీ వ్రతం.

### శుభ ముహూర్తాలు

భాద్రపదమాసం శూన్యమాసం కావున వివాహాది శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య విషయాలకు ముహూర్తాలున్నాయి.

### సెప్టెంబర్ తిథులు
### భాద్రపద బహుళ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 21 | శని | విదియ | ప | 02.23 | గం.ల.వ |
| 22 | ఆది | తదియ | ప | 02.14 | గం.ల.వ |
| 23 | సోమ | చవితి | ప | 02.48 | గం.ల.వ |
| 24 | మంగళ | పంచమి | సా | 04.04 | గం.ల.వ |
| 25 | బుధ | షష్టి | సా | 05.54 | గం.ల.వ |
| 26 | గురు | సప్తమి | రా | 08.10 | గం.ల.వ |
| 27 | శుక్ర | అష్టమి | రా | 10.38 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




ఇతరుల పొగడ్తలకు మైమరచి విలువైన వస్తువులు లేదా ధనం వదులుకుంటారు. పరోపకారం అవలంభిస్తారు. బంధువుల రాక విస్మయం కలిగిస్తుంది. ధనం విషయంలో కొన్ని నిక్కచ్చిగా వుండడం అవసరం. పిల్లల వైవాహిక జీవితాన్న విచారించి ముందుకు నడుచుట మంచిది. వృత్తి, వ్యాపారాలలో మిశ్రమ ధనాదాయం వుంటుంది. ఆపద సమయంలో ఆదుకొనే మిత్రులు లభిస్తారు.




ఉల్లాసంగా, ఉత్సాహంగా వుంటారు. ధనార్జన చేయాలన్న కోరిక ఎక్కువగా వుంటుంది. శారీరక శ్రమను లెక్కచేయకుండా ప్రయాణాలు సాగిస్తారు. అంతర్గతంగా కుటుంబ పోరు వున్నా లెక్కచేయరు. స్పెక్యులేషన్ కలసి వస్తుంది. ఆకస్మిక ధనలాభం. భూ సంబంధమైన విషయాలలో పేచీలు రావచ్చు. కొన్ని చిక్కు వ్యవహారాలు పరిష్కారమౌతాయి. పితృ వర్గం నుంచి వ్యతిరేకత ఎదుర్కొంటారు.




కళా, క్రీడాకారులు కొంత అసంతృప్తిని ఎదుర్కొంటారు. ఆదాయానికి మించిన ఖర్చులుండడంతో పరస్పర అవగాహన అవసరం. వృత్తి, వ్యాపారాలలోని వారికి పాత బాకీలు వసూలవుతాయి. ఆర్థిక పరమైన పురోగతి సాధిస్తారు. విద్యార్థులకు సామాన్యం. స్థల మార్పిడులుంటాయి. ఇంటి విషయాలలో కొన్ని మార్పులు వుంటాయి. దాయాదుల పరంగా కొన్ని సమస్యలెదుర్కొంటారు.




గ్రహస్థితి సామాన్యంగా వుండడం వల్ల కొన్ని పనులు ఏకాగ్రతతో చేసిన నెరవేరుతాయి. ఆకస్మిక ఖర్చులుంటాయి. అడుగు ముందుకు వేసేటప్పుడు ఆలోచన అవసరం తర్వాత ప్రయోజనం వుండదు. వృత్తి మీద ధ్యాస తగ్గడం వల్ల ఇబ్బందులు తప్పవు. సమయ స్ఫూర్తి అవసరం. చేసే నిర్ణయాలలో తొందరపాటు తగదు. ప్రేమ, దాంపత్య విషయాలలో తప్పులు దొర్లకుండా జాగ్రత్త పడాలి.




స్త్రీలకు ఆరోగ్య విషయంలో పలు జాగ్రత్తలవసరం. కాంట్రాక్టు పనులు చేసేవారికి పలు ఆదాయాలున్నా, జాగ్రత్తలవసరమౌతాయి. అధిక ప్రయాణాలు, ప్రయాణాలలో ప్రమాదాలు లేదా అవాంఛనీయ సంఘటనలు జరగవచ్చు. బంధుమిత్రులతో మాట పట్టింపులుంటాయి. ఇరుగుపొరుగు వారితో స్వల్ప వివాదాలు, చేపట్టిన పనులు మందగించుట, ఆరోగ్య సమస్యలు బాధిస్తాయి.




ఈ రాశి వారు బలం పుంజుకుంటారు. కోరరాని వస్తువులను మనస్సు కోరుకొంటుంది. బంధుమిత్రులకు దూరంగా వుంటారు. వ్యవసాయదారుల కృషికి ఫలితముంటుంది. స్త్రీ సౌఖ్యం, కోరికలు నెరవేరుతాయి. తలపెట్టిన పనులు, కార్యాలు సజావుగా సాగి ధనాదాయం పొందుతారు. కొత్త విషయాలు తెలుసుకొని ప్రయోగాలు చేస్తారు. ఆకస్మిక ధనం పొందినా రుణబాధలు తప్పవు.

# గృహ, ప్రాసాద వాస్తు నిర్మాణ వివరణకు ప్రత్యేక గ్రంథాలు!

*డాక్టర్ పి.అక్షయ — బెంగుళూరు*

** వాస్తు గ్రంథాలు తంజావూరు గ్రంథాలయంలో చాలానే వున్నాయి. అందులో సామాన్యుడికి అందుబాటు ఏమిటి? జమీందారీ గృహాలకు ప్రత్యేక గ్రంథాలున్నాయని విన్నాను.*

మత్స్య, స్కాంద, అగ్ని పురాణాలు తదనుబంధ విశ్వామిత్ర, సమరాంగణ సూత్రధారణ, వశిష్ట వాస్తు గ్రంథాలు సామాన్యుడి గృహావసరాలను గురించి చర్చించాయి. గరుడ, విష్ణు పురాణాలు బృహసంహిత జమీందారీ గృహ ప్రస్తావనలతో లిఖించబడ్డాయి.

*ఎం.మరియమ్మ — కర్నూలు*

** వాస్తు నివారణ సూత్రాలే మానవ జీవితంపై ప్రభావాన్ని చూపిస్తాయా?*

వాస్తు, జ్యోతిష్యాలతోబాటు విధి నిర్ణయం, కర్మ ఫలితం కూడా ప్రభావాన్ని చూపిస్తుంది.

*డాక్టర్ ప్రభాకర్‌రావు — చెన్నై*

** వాస్తు పురుషుడు, విశ్వకర్మ, సూర్యుడు ఒకరేనా? సంశయం తీర్చండి?*

వాస్తు ప్రాచీన గ్రంథాలన్నీ ఈ మూర్తిత్రయం ఒక్కరే. అనగా వాస్తు పురుషుడని చెబుతున్నాయి.

*కె.మధుమిత — అనంతపురం*

** సర్ప దోషమని చెప్పారట. మా వారు కృంగి కృశించి పోయారు.*

ఈ ఆధునిక కాలంలో కూడా అట్లా బేలలైపోతే యెట్లా? దోషం నిజమో కాదో తేల్చుకుని, నిజమైతే శాస్త్రం ద్వారానే పరిష్కరించుకోవచ్చు కదా?

*డి.రమణారెడ్డి — జగతిపాళెం*

** 'టైం' అంటుంటారు నిజమేనా?*

మీరు ఆరు నెలల నుంచి ఈ ప్రశ్న అడగాలనుకొని ఇప్పుడడిగారు కదా? ఇదే టైం అంటే. అగస్య మహర్షి ఉవాచ చూడండి. ప్రాప్తం సరైన కాలంలో జరుగుతుంది. ఆ ప్రాప్తం మన మంచికే జరుగుతుంది.

*వై.పుల్లయ్యనాయుడు — రాపూరు*

** వాస్తు సమస్యల వల్ల కూడా గ్రామాలు అభివృద్ధి చెందవా?*

రాపూరు టౌన్‌నే తీసుకోండి. ఉత్తరం స్మశానం, దక్షిణం పల్లపు భూమి, తూర్పు అస్తవ్యస్తమైన నేలలు, పశ్చిమం చెరువు వున్నది. ఈ స్థితిని 'క్షామాంకం' అంటారు. ఇలాంటి గ్రామాలలో అభివృద్ధి చాలా తక్కువగా వుంటుంది.

*ఎం.గుణమణి — చెన్నై*

** మా యింట ప్రతిష్టించిన యంత్రం ఏ ప్రభావాన్నీ చూపలేదు.*

'యంత్రం' కనీసం మూడు లోహాలతో తయారై బలి, పూజ, సంప్రోక్షణ, అర్చన వంటి విధివిధానాల వల్ల శక్తివంతమై వుండాలి. అంగట్లో కొన్న యంత్రాలు పని చేయవు. పైగా ప్రతికూల పరిస్థితుల్ని కల్పిస్తాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.శకుంతలారెడ్డి — తిరుచానూరు*

** పావురాలు పెంచడం దారిద్ర్యమనీ, వాటి అరుపులు అరిష్టమని అంటున్నారు.*

అలా అని ప్రాచీన శాస్త్రాలలో ఎక్కడాలేదు. పక్షి, జంతువుల పెంపకం గృహస్థుకు మంచిది. పైగా ఒక్కొక్క దానివల్ల ఒక్కోరకంగా అదృష్టం కూడా కలసొస్తుంది. పశు, పక్షి, దేవతా అన్నది శాస్త్ర సూక్తం.

*ఎం.సూర్యనారాయణ — బెంగుళూరు*

** 'హోమం' శుభకార్య సంపృష్టం అని ఎక్కడో చదివాను.*

'హోమం' దక్షిణాది సాంప్రదాయం కాదు. ఉత్తరాది నుంచి మనం గ్రహించినది. శిశువుకు మూడు సంవత్సరాల వయసొచ్చే వరకూ ఏ గృహంలోనూ వీటిని పాటించరాదని 'ధర్మసింధు' శాసిస్తున్నది.

*డి.వి.ఆర్ — చిత్తూరు*

** జీవితంలో ఓడిపోయాను. దేవుడు ఇంత నిర్దయుడని అనుకోలేదు.*

అధైర్యపడకండి. 'హనుమ మంత్ర' పారాయణం నూటొక్కసార్లుచేసి, చివరి మూడవరోజు ఆకు పూజ చేయించండి. అతను సుఖపడేదేమీ లేదు. ఈ మాసాంతం లోపల అతను కటకటాల్ని లెక్కపెట్టాల్సిన 'యోగం' వుంది.

*టి.అభిషేక్ — గూడూరు*

** యంత్ర ప్రతిష్ట తర్వాత పరిస్థితులు చాలా బాగా చక్కబడ్డాయి.*

చాలా సంతోషం. వాస్తు దోష నివారణ జరిగింది. జ్యోతిష శాస్త్ర దోషాలకు నిర్ధారిత రత్నాల్ని వెంటనే ధరించండి. శుభం జరుగుతుంది.

### ○ సమైక్యాంధ్ర ఉద్యమం మూలంగా

# మూతబడిన సంక్షేమ హాస్టళ్లు!

**జిల్లాలో జరుగుతున్న సమైక్యాంధ్ర ఆందోళనలు, ఉద్యోగుల సమ్మె మూలంగా సంక్షేమ హాస్టళ్లన్నీ మూతబడ్డాయి. వీటిలో ఉంటూ చదువుకొంటున్న ఎస్సీ, ఎస్టీ, బిసి విద్యార్థుల భవిష్యత్తు అగమ్యగోచరంగా మారింది.**

జిల్లాలో జరుగుతున్న సమైక్యాంధ్ర ఆందోళనలు, ఉద్యోగుల సమ్మె ప్రభావంతో పేద విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు. ప్రధానంగా ఎస్సీ, ఎస్టీ, బిసి సంక్షేమ హాస్టళ్లలో వుంటూ చదువుకుంటున్న వారి భవిష్యత్ ఆందోళనగా మారింది. ఈ సంవత్సరం పాఠశాలలు పునః ప్రారంభమైన తర్వాత విద్యార్థులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలంటూ రెండు నెలల పాటు వివిధ దఫాలుగా విద్యార్థి సంఘాలు బంద్‌కు పిలుపునిచ్చాయి. విద్యార్థి సంఘాల మధ్య ఏర్పడిన పోటీ కారణంగా ఒకరి తర్వాత మరొకరు పాఠశాలలు మూయించడం జరిగింది. వీటి నుంచి తేరుకుని స్కూళ్లు నడుస్తున్న వేళ కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విభజన చేస్తున్నట్లు ప్రకటన జారీ చేయడంతో తిరిగి ఆందోళనలు మొదలైనాయి. జిల్లాలో ఏ ఆందోళన జరిగినా తొలుత ప్రభావం పడేది విద్యాసంస్థల పైనే.

రాజకీయ పార్టీలు, వివిధ ప్రజాసంఘాలు, కార్మిక సంఘాలు, చివరికి ప్రభుత్వ ఉద్యోగులు సైతం సమ్మెకు దిగారు. ప్రైవేటు విద్యాసంస్థలు, ప్రభుత్వ పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులు కొన్ని రోజుల పాటు సమ్మె చేసినప్పటికీ విద్యార్థుల భవిష్యత్ దృష్టిలో వుంచుకొని సమ్మె నుంచి పాఠశాలలను మినహాయిస్తున్నట్లు ప్రకటించారు. కాని కొన్ని ఉపాధ్యాయ సంఘాలు సమ్మెలో వుండగా, మరికొన్ని ఉపాధ్యాయ సంఘాలకు చెందినవారు విధుల్లో వున్నారు. ఎస్సీ, ఎస్టీ, బిసి హాస్టళ్లలో పనిచేస్తున్న వార్డన్లు, మాట్రిన్లు, ఇతర సిబ్బంది సమ్మెలోకి వెళ్లడంతో హాస్టళ్లను పూర్తిగా మూసివేయాల్సి వచ్చింది. దీంతో దూర ప్రాంతాలకు చెందిన విద్యార్థులు ఇళ్లకు వెళ్లిపోయారు. సంక్షేమ శాఖ అధికారులు సైతం సమ్మెలో వుండడంతో హాస్టళ్లను గురించి పట్టించుకొనేవారు లేకుండాపోయారు. జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్ తప్ప అన్ని శాఖల ఉన్నతాధికారులు సకల జనుల సమ్మెలో వున్నారు.

### హాస్టల్ విద్యార్థుల పరిస్థితి ఏమిటి?

పాఠశాలలు పనిచేస్తూ... హాస్టళ్లను మూసివేయడంతో విద్యార్థులతోపాటు తల్లిదండ్రులు ఆందోళన చెందుతున్నారు. గత నెలరోజుల నుండి సమైక్యాంధ్ర ఉద్యమం జిల్లాలో జరుగుతోంది. బయటి విద్యార్థులు పాఠశాలకు వెళ్లి చదువుకుంటుండగా, హాస్టల్ విద్యార్థులు దూర ప్రాంతాల్లో వుండడం వల్ల పాఠశాలకు వెళ్లలేని పరిస్థితి. నెల రోజుల నుండి పాఠశాలకు వెళ్లకపోవడం కారణంగా చదివిన పాఠ్యాంశాలు మరచిపోయే అవకాశం వుంది. సమ్మె నుండి పాఠశాలకు మినహాయింపునిచ్చిన అధికారులు హాస్టళ్లకు మినహాయింపు ఇవ్వకపోవడం ఏమిటని తల్లిదండ్రులు ప్రశ్నిస్తున్నారు. పేద విద్యార్థులు వసతి పొందే హాస్టళ్లపై సంక్షేమశాఖ అధికారులు వివక్షత చూపడం సమంజసం కాదని వ్యాఖ్యానిస్తున్నారు.

### ఎమ్మార్పీఎస్ దీక్షలు

సమైక్యాంధ్ర ఆందోళనల నుండి పాఠశాలలు, ఆర్టీసి బస్సులు, హాస్టళ్లను మినహాయించాలని డిమాండ్ చేస్తూ మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎమ్మార్పీఎస్) ఆధ్వర్యంలో దీక్షలు చేపట్టారు. నగరంలోని కొండాయపాళెం గేటు సమీపంలో వున్న అంబేద్కర్ భవన్ ఎదుట రిలే నిరాహార దీక్షలు ప్రారంభించారు. సమ్మె కారణంగా హాస్టళ్లలో వుంటూ చదువుకొంటున్న ఎస్సీ, ఎస్టీ, బిసి విద్యార్థుల భవిష్యత్ గురించి సమైక్యవాదులు ఆలోచన చేయాలని దీక్షలో పాల్గొన్న నేతలు విజ్ఞప్తి చేశారు. ఇప్పటికే విద్యాసంవత్సరం ప్రారంభమై నాలుగు నెలలు గడుస్తున్నా సక్రమంగా ప్రభుత్వ పాఠశాలలు పని చేయలేదని ఇప్పటికైనా అధికారులు స్పందించి విద్యాసంస్థలు పని చేసే విధంగా చర్యలు తీసుకోవాలని కోరారు. సకల జనుల సమ్మెలో వున్న ప్రభుత్వ అధికారులు, సిబ్బంది, ఉపాధ్యాయులు పేద విద్యార్థులను దృష్టిలో వుంచుకొని సమ్మె నుండి వైదొలగాల్సిన అవసరం వుంది.

**రహస్య భర్తీ**

# గుట్టుచప్పుడు కాకుండా పెద్దాసుపత్రిలో పోస్టుల భర్తీ!

నెల్లూరు పెద్దాసుపత్రిలోని ట్రామాకేర్ విభాగంలో ఖాళీగా ఉన్న 81 పోస్టుల భర్తీకి దరఖాస్తులు ఆహ్వానించారు. కానీ జిల్లా ఎంపిక కమిటీ నేతృత్వంలో ఎంపిక ప్రక్రియ చేయకుండా డబ్బులిచ్చిన వారికి ఈ పోస్టులు ఇచ్చేశారన్న విషయం ఆలస్యంగా బయటకు పొక్కింది.



వివాదాల్లో నెల్లూరు పెద్దాసుపత్రి.

జిల్లా ప్రభుత్వాస్పత్రిలో ఖాళీగా వున్న పోస్టులను గుట్టుచప్పుడు కాకుండా భర్తీ చేసేశారు. మూడు సంవత్సరాల క్రితం వైద్య విధాన పరిషత్ జిల్లా ప్రభుత్వాసుపత్రిలోని ట్రామా కేర్ విభాగంలో ఖాళీలను భర్తీ చేయాలని నిర్ణయించి దరఖాస్తుల్ని ఆహ్వానించడం జరిగింది. అటెండర్ దగ్గర నుంచి మెడికల్ ఆఫీసర్ వరకు ఖాళీలున్నట్లు అప్పట్లో ప్రకటించారు. ఒక్కో దరఖాస్తును 50 రూపాయలకు విక్రయించగా భారీ ఎత్తున దరఖాస్తులు అమ్ముడు పోయాయి. ప్రధానంగా ఎస్సీ, ఎస్టీలు అటెండర్, ల్యాబ్ టెక్నీషియన్ పోస్టులకు దరఖాస్తులు చేసుకున్నారు. దరఖాస్తులు స్వీకరించిన అధికారులు ఆ తర్వాత వీటి గురించి పూర్తిగా మరచిపోయారు. దరఖాస్తు చేసిన అభ్యర్థులు పలు దఫాలు ఖాళీల భర్తీ గురించి అడిగినా స్పందించేవారు లేకుండా పోయారు.

ఇటీవల దరఖాస్తు చేసిన కొందరు అభ్యర్థులు పెద్దాస్పత్రిలో ఖాళీల భర్తీపై ఆరా తీయగా దాదాపు ఎనిమిది నెలల క్రితం అన్ని పోస్టులు భర్తీ చేసినట్లు సమాధానం రావడంతో ఈ విషయం ఆలస్యంగా బయటకు పొక్కింది. అభ్యర్థులకు ముందస్తు సమాచారం లేకుండానే గుట్టుచప్పుడు కాకుండా ఖాళీలను భర్తీ చేసినట్లు తెలిసింది. వైద్య విధాన పరిషత్ నిబంధనల ప్రకారం జిల్లాలో ఎంపిక కమిటీ ఆధ్వర్యంలో ఈ ప్రక్రియను పూర్తి చేయాల్సి వుంటుంది. కానీ ఇక్కడ ఏకపక్షంగా వ్యవహరించారన్న ఆరోపణలున్నాయి. దరఖాస్తులు స్వీకరించినప్పుడు ఆసుపత్రుల సమన్వయకర్తగా డాక్టర్ చెన్నయ్య విధులు నిర్వహించేవారు. సాధారణ బదలీల్లో భాగంగా చెన్నయ్యను వేరేచోటుకు బదలీచేసి ఆయన స్థానంలో ఒక మహిళను పదోన్నతిపై నియమించడం జరిగింది. ఈమె బాధ్యతలు తీసుకున్న ఏడాది తర్వాత పోస్టులు భర్తీ అయ్యాయి. జిల్లా ఎంపిక కమిటీలో సమన్వయకర్తతోపాటు డిఎంఅండ్‌హెచ్‌ఓ, అదనపు జిల్లా జాయింట్ కలెక్టర్, ఆసుపత్రి సూపరింటిండెంట్ తదితరులు వున్నారు.

పెద్దాసుపత్రిలో ఖాళీగా ఉన్న 81 పోస్టులకు ఎన్ని దరఖాస్తులు వచ్చాయి. వాటిలో ఎన్నింటిని పరిశీలించారు. ఎంత మందిని ఎంపిక చేశారు, వారి వివరాలను నోటీస్ బోర్డులోనూ ప్రకటించి పత్రికాముఖంగా అభ్యర్థులకు సమాచారం అందించాలి. ఎంపిక కమిటీ సభ్యులకే సమాచారం లేకుండా అభ్యర్థులను ఎంపికచేసి ఆ తర్వాత కమిటీ సభ్యుల చేత సంతకాలు చేయించుకున్నారన్న ప్రచారం జరుగుతుంది. ఈ పోస్టు భర్తీలో భారీ స్థాయిలో అవకతవకలు జరిగి నగదు చేతులు మారిందన్న విషయాన్ని ఆసుపత్రిలో విధులు నిర్వహించే ఉద్యోగులు గుసగుసలాడుకొంటున్నారు. అప్పటి కలెక్టర్‌కు ఎంపిక విషయం తెలిసినా కూడా ఏమీ చేయలేక పోయారన్న విమర్శ వుంది. 81 పోస్టులకు వేలల్లో దరఖాస్తులు రాగా రాజకీయ పలుకుబడి కలిగి, కాసులు సమర్పించిన వారినే ఎంపిక చేశారని మిగిలిన అభ్యర్థులు వ్యాఖ్యానిస్తూ ఎంపికలపై పూర్తి స్థాయి విచారణ జరిపించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు.

గత నెలలో జిల్లా వైద్య ఆరోగ్య శాఖలో 31 ఎఎన్‌ఎం పోస్టుల భర్తీకి దరఖాస్తులు స్వీకరించారు. దాదాపు 600 మంది దరఖాస్తు చేసుకున్నారు. మెరిట్ ప్రాతిపదికన ఎంపికచేసే అవకాశం వున్నప్పటికీ కొందరు కార్యాలయ సిబ్బంది పోస్టు ఇప్పిస్తామంటూ ప్రచారం చేశారు. ఈ విషయం జిల్లా కలెక్టర్ దృష్టికి వెళ్లడంతో వెంటనే స్పందించారు. మొత్తం స్వీకరించిన దరఖాస్తులను నోటీస్ బోర్డులో ప్రకటించడంతోపాటు మెరిట్ జాబితాను రూపొందించి ప్రచురించాలని ఆదేశించారు. దీంతో ఎటువంటి అక్రమాలకు ఆస్కారం లేకుండా ఎంపిక ప్రక్రియ సజావుగా సాగేందుకు అవకాశం ఏర్పడింది. వైద్య విధాన పరిషత్ ఆధ్వర్యంలో మాత్రం ఖాళీల భర్తీ విషయంలో అంతా నిబంధనలకు విరుద్ధంగా సాగింది. దీనిపై జిల్లా కలెక్టర్ స్పందించాల్సిన అవసరం వుంది.

# కిస్ బోర్!



అల్లూరు రహీం

అబ్బాయి, అమ్మాయిల మధ్య ప్రేమ పుట్టడానికి ఆరు నెలలు, సంవత్సరం అవసరం లేదు. అది సందర్భాన్ని బట్టి పుడుతుంది. ఒక్కోసారి చూసిన తొలి క్షణంలోనే పుడుతుంది. ప్రపంచంలో తొలి చూపులోనే పుట్టిన ప్రేమ కోట్లాది మంది జీవితాల్లో అనూహ్య మార్పులు తెచ్చిన సాదృశ్యాలు కోకొల్లలు. ఇటువంటి ప్రేమను కథా వస్తువుగా తీసుకొని వెండితెరపై వేల కథలు ప్రదర్శితమయ్యాయి. జనం మన్ననలు పొందాయి. తెలుగు సాహిత్యంలో పేరెన్నిక రచయిత అడివి బాపిరాజు మనుమడు పంజా, బలుపుతోపాటు రాజమౌళి బాహుబలి చిత్రంలో విలన్‌గా నటిస్తున్న అడివి శేష్ కథకుడు, దర్శకునిగా వ్యవహరించడంతోపాటు హీరోగా కూడా నటించిన చిత్రం కిస్. ఈ చిత్రాన్ని ఆయన పూర్తిగా అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో తీశాడు. శేష్ పుట్టింది పెరిగింది ఇక్కడే కాబట్టి ఇక్కడి అద్భుతమైన ప్రదేశాల్లోనే చిత్రమంతా తీశాడు. గోల్డన్ గేట్ బ్రిడ్జి, ఎయిర్ పోర్ట్, అక్కడి ఆకాశ హర్మ్యాలను కెమెరామెన్ షెనీల్‌దియో చూపిన తీరు బాగుంది. శేష్‌కు నటన, దర్శకత్వంలో శాన్‌ఫ్రాన్సిస్కో విశ్వవిద్యాలయంలో బ్యాచిలర్ డిగ్రీ వుందట. కానీ ప్రేమను జనరంజకంగా చూపను ఈ డిగ్రీలు కొలమానం కావని కిస్ చిత్రం చూస్తే తెలిసిపోతుంది. అందమైన హీరోయిన్ ప్రియాబెనర్జీని ఎన్నుకోవడం మినహా ప్రేమ పుట్టడం, పెరగడం, ప్రేమికుడు లేకుండా ఉండలేనని ప్రేమించిన అమ్మాయి చెప్పే సన్నివేశాలను దర్శకుడు ప్రేమపూర్వకంగా చిత్రీకరించలేకపోయాడు. శేష్ దర్శకత్వం, నటన రెండింటికి న్యాయం చేయలేక 'కిస్' చిత్రాన్ని కిస్మిస్ చేసి పారేశాడు. హీరో, హీరోయిన్ పాత్రల మధ్యే చిత్రాన్ని నడపాలంటే స్క్రీన్‌ప్లే బ్రహ్మాండంగా ఉండాలి. స్టారింగ్ ఖర్చు తక్కువ చేయను అమెరికాలోని స్థానికులను ఎక్కువగా వాడిన తీరు ఈ సినిమాను దెబ్బ కొట్టింది. నవరసాలు లేకపోవడం, ప్రేమకథా చిత్రాలకు ప్రాణంపోసే సంగీతంలో మరీ పాశ్చాత్య పోకడలు ధ్వనించడం ఈ సినిమా ప్రేక్షకులు చూడకుండా చేస్తాయి. అయితే చిత్రం చివరలో శాన్‌ఫ్రాన్సిస్కో విమానాశ్రయంలో హీరోయిన్ హీరోకు ఐ లవ్ యూ బోర్డ్ చూపించడం, మారు మాట్లాడకుండా కిస్(ముద్దు)ఇవ్వడం మాత్రం మనసును కట్టి పడేస్తాయి. శేష్ వ్రాసిన బండ బూతులు తిట్టు... కానీ బాధపడకు, లైఫ్‌నే మార్చేసే వ్యక్తి లైఫ్ పార్ట్‌నర్. ఆడవాళ్లు హైపర్ క్రేట్స్, బతకడానికి కొంత ధైర్యం చాలు. చావడానికి చాలా ధైర్యం కావాలి మాటలు ఆలోచింపజేస్తాయి.




చిత్ర కథలోనికి వెళ్తే హాలీవుడ్‌లో కథానాయకుడు అయిపోదామని దొంగ వీసాతో అమెరికా వెళ్తాడు అమీర్‌పేట శ్రీను(అడివి శేష్). తనకు వచ్చిన బట్లర్ ఇంగ్లీషు మాట్లాడుతూ బతుకు పోరాటం చేస్తూ ఇక తన పప్పులుడకవు అని తెలుసుకొని స్వదేశానికి బయలు దేరుతున్న సమయంలో ధనవంతురాలైన అమ్మాయి ప్రియ(ప్రియాబెనర్జీ) సముద్రంలో దూకి ఆత్మహత్యకు ప్రయత్నిస్తుండగా ఆమెను శ్రీను రక్షిస్తాడు. తనకు ఇష్టంలేని వ్యక్తి రవి(డాక్టర్ భరత్)తో పెద్దలు పెళ్లి చేయాలనుకోవడం వల్లే ఈ దురాగతానికి పాల్పడుతున్నట్లు ప్రియ శ్రీనుకు చెబుతుంది. ఆమెను నిలువరించి 24 గంటలు ఆమెతో గడిపే క్రమంలోనే శ్రీను ఆమె జీవితాన్ని మార్చేస్తాడు. ప్రియ మనసు నిండా పూర్తిగా శ్రీను నిండిపోతాడు. ఇద్దరూ కలసి 24 గంటల్లో ఎన్నెన్నో పనులు చేసేస్తారు. అంతిమంగా శ్రీను ప్రియను ఆమె మామకు అప్పగించి ఇండియా బయలుదేరను ఎయిర్‌పోర్టుకు వస్తాడు. ప్రియ తల్లితండ్రులను ఒప్పించి ఎయిర్ పోర్ట్‌కు పరుగున వచ్చి ప్రియుడికి ఐలవ్‌యూ చెప్పి ముద్దివ్వడంతో సినిమా ముగుస్తుంది. అడివి శేష్ కిస్ చిత్రంలో తాను చేసిన పొరపాట్లను తెలుసుకొని సరిదిద్దుకోగలిగితే భవిష్యత్తులో మంచి దర్శకునిగా తయారు కాగలడు. హీరోయిన్ ప్రియాబెనర్జీ నటన, అందంతోనూ ఆకట్టుకొన్నా ప్రయోజనం లేకుండా చేసింది కిస్ చిత్రం.



# అతడుంటే ఓకే!

సినీ పరిశ్రమలో చాలామంది హీరోయిన్లకు హీరో మహేష్‌బాబు ఫీవర్ ఉంది. మహేష్‌బాబుతో ఒక్కసారి నటించాలని ఉంది అని పలువురు హీరోయిన్లు తమ మనసులో మాట బయట పెట్టారు. ఇప్పుడు బాలీవుడ్ భామలూ అదే మాట అంటున్నారు. రాన్‌జానాతో ఆకట్టుకొన్న హీరోయిన్ సోనమ్ కపూర్ కూడా మహేష్ మంత్రమే జపిస్తుంది. ఆమెకు తెలుగు పరిశ్రమ నుంచి అవకాశాలు వస్తున్నాయట. అయితే దేనికీ ఓకే చెప్పడంలేదని అంటోంది. తెలుగు పరిశ్రమ చాలా గొప్పది. నాకూ ఇక్కడ నిరూపించుకోవాలని ఉంది. కానీ భాషతోనే అసలు సమస్య. నాకు తెలుగు రాదు. అయితే మహేష్‌బాబు లాంటి కథానాయకుడితో సినిమా అంటే ఇవేం పట్టించుకోకుండా ఓకే చెప్పేస్తా అంటోంది.



## బాలీవుడ్‌కు అమలాపాల్!

ఈ మధ్య దక్షిణాది కథలు, నటీనటులు బాలీవుడ్‌కు వెళుతున్నారు. ధనుష్ 'రాన్‌జానా'తో విజయం అందుకొన్నాడు. ఇలియానా, శ్రుతిహాసన్, తమన్నాలకు హిందీలో అవకాశాలకు కొదవలేదు. ప్రియమణి 'చెన్నై ఎక్స్‌ప్రెస్' చిత్రంలో ఐటమ్ పాటలో మెరిసింది. ఇప్పుడీ జాబితాలో మరో హీరోయిన్ కూడా చేరింది. అమలాపాల్ అక్షయ్‌కుమార్ సరసన నటించే అవకాశం చేజిక్కించుకొంది. అక్షయ్‌కుమార్ హీరోగా గబ్బర్ అనే సినిమా తెరకెక్కబోతోంది. అందులో హీరోయిన్‌గా అమలాపాల్‌ను ఎంచుకొన్నారు. హిందీ చిత్రాల్లో నటించాలని ఎన్నాళ్లగానో అమలాపాల్ చేసిన ప్రయత్నాలు గబ్బర్‌తో సఫలీకృతమయ్యాయి.

## సమంత సంఘసేవ

హీరోయిన్ సమంత ఈ మధ్య సినిమాలతోపాటు సమాజసేవపై కూడా దృష్టి పెడుతోంది. తనవంతుగా ఆదుకొంటోంది. ఓ సామాజిక సేవా సంస్థ కోసం విరాళాలు సేకరించే పనిలో పడింది. ఆమె అభిమానులు కూడా ఈ మంచి పనిలో పాలు పంచుకొంటున్నారు. దిల్‌సుఖ్‌నగర్ బాంబు పేలుళ్లలో ఓ కాలు పోగొట్టుకొన్న మహిళకు 50వేలు సాయమందించింది. మరో మహిళకు కృత్రిమ కాలు అమర్చను రెండు లక్షల 30వేల రూపాయలిచ్చి ఆదుకొంది. ఈ సమాజ సేవ విస్తృతంగా చేయాలని ఉంది. దీనికో క్రమబద్ధమైన ప్రణాళికను రూపొందిస్తున్నట్లు సమంత చెప్పుకొచ్చింది.

## అమ్మ పాత్రలు ఇవ్వండి!

రోజా చిత్రంలో అత్యద్భుత నటనతో ప్రేక్షకుల మనసు దోచిన తార మధుబాల. పెళ్లయ్యాక గ్యాప్ తీసుకొని ఇటీవలే అంతకు ముందు ఆ తర్వాత చిత్రంలో హీరోయిన్‌కు తల్లిగా నటించి తెలుగు సినిమాకు మరో అమ్మ దొరికిందనిపించింది. మధుబాల దక్షిణాది చిత్రాల్లో నటించాలని ఉబలాట పడుతుంది. కేవలం ఇవి మాత్రమే కాదు. వైవిధ్యమైన ఏ పాత్రలనైనా పోషిస్తా. నాకు కథ నచ్చితే చాలంటోంది. కెరీర్ అయిపోయింది అనుకొంటున్న దశలో ఇలా అమ్మగా మారడం ఎంతో ఉత్సాహాన్నిస్తోంది. కెరీర్‌లో ఈ దశ వస్తుందని అనుకోలేదు. నన్ను చిత్రసీమ హీరోయిన్‌గా చూళ్లేదు. నటిగా గుర్తించింది. నాలో అమ్మని చూడడం ఆనందంగా ఉంది అంటోంది మధుబాల.





## బికినీ వేయలేను!

బాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ ప్రియాంక చోప్రాకు చెల్లెలు వరసవుతుంది పరిణీతి. ఈ ముద్దుగుమ్మ యశ్‌చోప్రా సంస్థలో ఉద్యోగిగా ప్రస్థానాన్ని ప్రారంభించింది. ఆ తర్వాత నటనపై ఉన్న అభిమానంతో కెమెరా ముందుకు వచ్చింది. తక్కువ సమయంలోనే 'శుద్ధ్ దేశీ రొమాన్స్' చిత్రంతో మంచి గుర్తింపు తెచ్చుకొంది. ఈ చిత్రంలో బోలెడన్ని ముద్దు సన్నివేశాలున్నాయి. నిజానికవి చేయాలనుకొన్నప్పుడు చాలా సంకోచించాను. కథ డిమాండ్ చేయడంతో కాదనలేక పోయాను. ముద్దు సన్నివేశాలు అయిపోయాయి కదా ఇప్పుడు అందరు బికినీల గూర్చి అడుగుతున్నారు. బికినీ నా ఒంటికి సరిపడదు. కొన్ని పనులు కొంతమంది మాత్రమే చేయాలి. అందరూ అన్నీ చేస్తే బాగుండదంటోంది పరిణీతి చోప్రా.



# డిఇఓ X ఎన్జీఓ!

## ఎవరు గొప్ప?



సమైక్యాంధ్ర ఉద్యమం జిల్లాలో ఊపందుకోవడానికి కారణం ఉద్యోగులే. ఎన్జీఓలు, ఇతర ఉద్యోగులు ముందుండి ఉద్యమాన్ని ఉధృతంగా సాగిస్తున్నారు. జిల్లా అధికారులు పలువురు కీలకంగా వ్యవహరిస్తున్నారు. అలాంటి ఉద్యమంలో అధికారులు, ఉద్యోగ సంఘాల నేతల మధ్య మనస్పర్థలు చోటుచేసుకోవడంతో ఆధిపత్య ధోరణి ప్రబలుతోంది. ఎసి స్టేడియంలో నిర్వహించిన సింహగర్జన కార్యక్రమంలో ఈ మనస్పర్థలకు బీజం పడింది. ఆ కార్యక్రమంలో సమైక్యాంధ్ర వాదాన్ని గట్టిగా విన్పించేందుకు జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం సిద్ధమై వచ్చాడు. కానీ ఆ కార్యక్రమాన్ని నడిపించిన ఎన్జీఓ నేత రవీంద్రబాబు రామలింగం మాట్లాడేందుకు తక్కువ సమయం ఇవ్వడం, అదీ చివరన మైకు అందించడంతో రామలింగం తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశాడు. రవీంద్రబాబు కావాలని తనకు చివరిలో అవకాశం ఇచ్చాడని ఉపాధ్యాయుల వద్ద వాపోయాడు. అక్కడే వీరిరువురి నడుమ వివాదం మొదలైంది. తర్వాత కావలిలో డిఇఓ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో రామలింగం తనకు ఎలాగైతే రవీంద్రబాబు సరిగా ప్రసంగించే అవకాశం ఇవ్వలేదో, అదే మాదిరి అతనికి చివరిలో మైక్ ఇచ్చి కక్ష తీర్చుకొన్నాడు. దీంతో ఇద్దరి మధ్య ఏర్పడిన మనస్పర్థలు తీవ్రతరం అయ్యాయి. దీనికితోడు ఉపాధ్యాయులకు సరైన ప్రాధాన్యమివ్వడం లేదంటూ కొందరు ఉపాధ్యాయులు ఏజెసి పెంచలరెడ్డితో వాగ్వివాదానికి దిగడం చర్చనీయాంశమయ్యింది. ఇలా అధికారులు, ఉద్యోగులు తమ స్వార్థం కోసం ఉద్యమాన్ని ప్రక్కదారి పట్టిస్తుండడంపై పలువురు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

# చిన్నపిల్లలకు ఉచిత వైద్యం!

- నవజాత శిశుసంరక్షణ కేంద్రంలో అన్నీ సౌకర్యాలు

పురిటి శిశువులకు అత్యవసర వైద్య సేవలందించేందుకు ఏర్పాటు చేయబడిన నవజాత శిశు సంరక్షణ కేంద్రం కార్పొరేట్ ఆసుపత్రులను తలపించే విధంగా పనిచేస్తుంది. నగరంలో జూబ్లీ ఆస్పత్రి ప్రాంగణంలో ప్రత్యేకంగా శిశువుల కోసం వైద్య ఆరోగ్య శాఖ శిశు సంరక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేసింది. జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ ద్వారా విడుదలైన నిధులతో ఈ కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు. షిఫ్ట్ పద్ధతిలో 24 గంటలు వైద్య సేవలు అందించేందుకు ఆరుగురు చిన్నపిల్లల వైద్య నిపుణులు, సిబ్బంది ఇక్కడ విధులు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వ ఆసుపత్రులంటే చిన్నచూపు చూస్తారు. ఈ ఆసుపత్రుల్లో వైద్యం కోసం వెళ్లాలంటే సందేహించడం సహజం. కానీ శిశు సంరక్షణ కేంద్రాన్ని ఒకసారి పరిశీలిస్తే కార్పొరేట్ ఆసుపత్రుల్లోని అన్ని మౌలిక సదుపాయాలు ఇక్కడ వుండడంపై ఆశ్చర్యపోక తప్పదు. జూబ్లీ ఆస్పత్రిలో ఎక్కువ మంది పేద మహిళలు కాన్పులు చేయించుకుంటారు. పుట్టిన శిశువు అనారోగ్యంగా వున్నట్లు గుర్తిస్తే వెంటనే ప్రక్కనే వున్న శిశు సంరక్షణ కేంద్రంలో వుంచి చిన్నపిల్లల వైద్య నిపుణుల పర్యవేక్షణలో వైద్యం అందిస్తున్నారు. గతంలో జూబ్లీ ఆస్పత్రిలో జన్మించిన శిశువుకు ఏదైనా అనారోగ్యం వస్తే ప్రైవేటు కార్పొరేట్ ఆసుపత్రికి తీసుకెళ్లి వైద్యం చేయించుకునే వారు. అక్కడ ప్రత్యేక విభాగంలో వుంచితే గంటకు వెయ్యి రూపాయలు వసూలు చేసేవారు. ఆర్థిక స్థోమతలేని వారు శిశువు సంరక్షణ కోసం అనేక ఇబ్బందులు పడేవారు. వైద్య, ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో అన్ని వసతులతో శిశు సంరక్షణ కేంద్రం ఏర్పాటు చేయడం వలన ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్లాల్సిన అవసరం లేకుండా పోయింది. జిల్లా కేంద్రంలో శిశు సంరక్షణ కేంద్రం ఏర్పాటు చేసి వున్న విషయం ప్రజలకు తెలియడం లేదు. అత్యాధునిక వైద్య పరికరాలతో ఇక్కడ చిన్న పిల్లలకు వైద్యం చేయను అన్ని వసతులు అందుబాటులో వున్నాయి. ఇదే వైద్యం ప్రైవేటు ఆసుపత్రులలో చేయించుకోవాలంటే వేలాది రూపాయలు ఖర్చు పెట్టాల్సిన పరిస్థితి. పేద, మధ్య తరగతి కుటుంబీకులకు ఈ శిశు సంరక్షణ కేంద్రం వరప్రసాదమనే చెప్పాలి. ఇప్పటికైనా వైద్య ఆరోగ్య శాఖ అధికారి స్పందించి శిశు సంరక్షణ కేంద్రం ఏర్పాటు చేసి వుందన్న దాని గురించి జిల్లావ్యాప్తంగా విస్తృత ప్రచారం నిర్వహించి ఇక్కడకు రోగులు వచ్చే చూడాల్సి వుంది.

# సమైక్యాంధ్ర ఉద్యమానికి నాయకత్వలోపం!

- సుదీర్ఘ కాలం సాగాలి మరి



నెల్లూరులో మహిళా ఉద్యోగినుల ర్యాలీ.

జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమం ఉధృతంగా సాగుతున్నా నాయకత్వ లేమితో కొట్టుమిట్టాడుతుంది. ఈ ఉద్యమంలో ఎన్జీఓలు, ఎజెసి మొదలు రెవిన్యూ శాఖలో అటెండర్ల వరకు భాగస్తులవుతున్నారు. వివిధ ప్రభుత్వ శాఖల ఉద్యోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థి ఐకాస, విద్యుత్ ఉద్యోగులు అన్నింటికి మించి ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలల విద్యార్థులకు తోడు ప్రజలు స్వచ్ఛందంగా ఈ ఉద్యమంలో పాల్గొంటున్నారు. రాజకీయ పార్టీల నేతలు మాటలకే తప్ప చేతల రూపేణా ఈ ఉద్యమానికి ఎటువంటి సహకారం అందించకపోయినా జిల్లాలో ఈ ఉద్యమం 40 రోజులుగా బ్రహ్మాండంగా జరుగుతుంది. జిల్లా అధికారులు పట్టుబట్టి నిర్వహించిన సింహపురి సింహగర్జన, కావలి కేక, స్వర్ణముఖి గర్జన కార్యక్రమాలు విజయవంతమయ్యాయి. సింహపురి సింహగర్జనను ఎసి స్టేడియంలో ఏర్పాటు చేయడం పొరపాటుగా అభివర్ణించవచ్చు. అదే విఆర్ కాలేజి గ్రౌండ్‌లో ఏర్పాటుచేసి ఉంటే నెల్లూరు స్తంభించిపోయేది. ప్రభుత్వ కార్యాలయాలు, బ్యాంకులు, స్కూళ్లు మూతబడినా వ్యక్తిగతంగా ప్రజలు ఇబ్బందులు పడుతున్నా పెద్దగా పట్టించుకోకుండా సమైక్యాంధ్రకు జై అంటున్నారు. ఆర్టీసి బస్సులు తిరగక పోవడం, బ్యాంకులు పని చేయక పోవడం, గ్రామాల్లో నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి పోవడం జనాన్ని బాగా ఇబ్బంది పెడుతున్న సమస్యలు. ఈ ఉద్యమం ఎన్ని రోజులు సాగుతుందో తెలియదు కనుక ఒక కార్యాచరణ ఉద్యమ పథం కావాలి. దీన్ని ప్రకటించే నాయకుడు కావాలి. ఆ నాయకుడు లేకపోవడంతో జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమం గందరగోళంగా జరిగిపోతుంది. ఉద్యమంలో పాల్గొంటున్న ప్రతి సంఘం, ఎన్జీఓలు, ఉద్యమ సానుభూతి పరులు ఒకచోట కూర్చుని కార్యాచరణ రూపొందించి దాన్ని ప్రకటించేందుకు అశోక్‌బాబులాంటి నాయకుడ్ని ఒకరిని ఎన్నుకొని ముందుకు సాగితే పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమానికి ఎదురుండదు. ఇక ప్రయత్నమే మిగిలి ఉంది.

# విద్యుత్ ఉద్యోగుల బెదిరింపు ఏమిటీ?

సమైక్యాంధ్ర కోసం సమ్మె చేస్తున్న విద్యుత్ ఉద్యోగులు బెదిరింపు ధోరణిలో వ్యవహరిస్తున్నారు. ఈ నెల 12వ తేది నుంచి 72 గంటలు విధులను బహిష్కరించి సమ్మె చేసిన సంగతి తెలిసిందే. మూడు రోజుల పాటు విద్యుత్ ఉద్యోగులు సమ్మెలో వుండడంతో జిల్లావ్యాప్తంగా కొన్ని ప్రాంతాల్లో విద్యుత్ సరఫరాకు అంతరాయం ఏర్పడింది. ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్ మాత్రం ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసినట్లు చెప్పినప్పటికీ నిలిచిపోయిన విద్యుత్‌ను పునరుద్ధరించడంలో విఫలం చెందారు. సమ్మెలోకి వెళ్లిన ఉద్యోగులను ఎవరైనా ఇబ్బంది పెడితే వారి ఇళ్లకు విద్యుత్ సరఫరాను నిలిపి వేస్తామని ఆ శాఖ జెఏసి నేతలు హెచ్చరించడం వివాదాస్పదంగా మారింది. దాదాపు నెల రోజులకు పైగా సమైక్యాంధ్ర ఆందోళనలు, ధర్నాలు, రాస్తారోకోలు, బంద్‌లతో ప్రజలు విసిగి పోతున్నారు. గ్రామీణ ప్రాంతాలకు ఆర్టీసి బస్సులు నిలిచిపోయి రాకపోకలకు ఇబ్బంది ఏర్పడింది. ఆందోళనల పేరుతో ఎన్నో ఇబ్బందులు సృష్టిస్తున్నా ప్రజలు సహిస్తున్నారు. కావాలని విద్యుత్ సరఫరా సిబ్బంది నిలిపివేస్తామని ప్రకటించడం పట్ల నగర ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. విద్యుత్ అందరికీ నిత్యావసరంగా మారిపోయింది. సమ్మెలో వున్న వారు సమ్మె చేస్తే ఎవరూ పట్టించుకోరు. అత్యావసర సేవలను బంద్ నుంచి మినహాయించాలని ప్రజలు కోరుతున్నారు. ప్రజల ఆకాంక్ష మేరకు ఉద్యోగులు ఉండాల్సి వుంది.




మళయాలీస్ వెల్ఫేర్ అసోసియేషన్ ఆధ్వర్యంలో నెల్లూరు టౌన్‌హాలులో జరిగిన ఓనమ్ సంబరాల్లో ప్రసంగిస్తున్న రాష్ట్ర హోటల్ అసోసియేషన్ ఉపాధ్యక్షులు అమరావతి కృష్ణారెడ్డి, వేదికపై జిల్లా కలెక్టర్ శ్రీకాంత్, మళయాలీస్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు నందకుమార్ తదితరులున్నారు.



# ముజీర్ ముదిరాడు

- విద్యార్థి జెఏసి నేతపై దాడి

విద్యార్థి జెఏసి రాష్ట్ర కో కన్వీనర్ ప్రసాద్‌పై ఆనం అనుచరులు దాడి చేయడం కలకలం రేపింది. ఎన్జీఓ అసోసియేషన్ చేస్తున్న సమైక్యాంధ్ర ఉద్యమంలో ప్రసాద్ కీలకంగా వ్యవహరిస్తూ తన వాణిని విన్పిస్తున్నాడు. గతంలో అతను ఎన్ఎస్‌యూఐ అధ్యక్షుడిగా, ఆనం వివేకానందరెడ్డి శిష్యుడిగా పనిచేసి నగరంలో విద్యార్థులపై దాడులకు పాల్పడుతూ, గొడవలకు దిగుతుండేవాడు. ప్రసాద్ వివేకానందరెడ్డికి దూరమయ్యి వైకాపాకు దగ్గరవ్వడంతో అతనిపై ఆనం వర్గీయుల్లో క్రోధం పెరిగింది. దీంతో చిన్న సాకుతో ఎన్ఎస్‌యూఐ జిల్లా అధ్యక్షుడు ముజీర్, అతని అనుచరులు దాడిచేసి గాయపరిచారు. ఎల్ఐసి జిల్లా కార్యాలయం ఎదుట జరిగిన ఈ దాడి పోలీసులు వ్యవహరించిన తీరు విమర్శల పాలయ్యింది. ప్రధానంగా దాడికి పాల్పడింది ముజీర్ అని బాధితుడు ఫిర్యాదు చేసినా ఎఫ్ఐఆర్‌లో అతన్ని ఐదో ముద్దాయిగా నమోదు చేయడం వెనుక ఎమ్మెల్యే ఒత్తిడి వున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. ఈ దాడిని ఖండిస్తూ ఎన్జీఓ అసోసియేషన్, సమైక్యాంధ్ర ఉద్యమకారులు జిల్లా ఎస్పీ కార్యాలయం ముందు పెద్ద ఎత్తున ఆందోళనకు దిగారు. ఉద్యమంలో చిచ్చురేపేలా వ్యవహరిస్తున్నాడని వివేకానందరెడ్డిపై విమర్శలకు దిగారు. దాడిచేసిన వ్యక్తులపై కఠిన చర్యలు చేపట్టాలని డిమాండ్ చేశారు. అదేవిధంగా వేదాయపాళెంలో వినాయకుడి బొమ్మ పెట్టి సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలను పోలీసులు ట్రాఫిక్ అంతరాయం పేరుతో అదుపులోకి తీసుకోవడం, కార్యక్రమాలను అడ్డుకోవడంపై విమర్శలు వ్యక్తం అయ్యాయి. పోలీసుల ముందస్తు అనుమతితో గణపతి విగ్రహాన్ని ఏర్పాటు చేసుకొని సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తుంటే కక్షగట్టి ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పోలీసులను ఉసిగొల్పడం చర్చనీయాంశమైంది.

# డప్పు కళాకారులకు ఉపాధి!

జిల్లాలో వున్న డప్పు కళాకారులకు ఇప్పుడు ప్రతిరోజు ఉపాధి లభిస్తుంది. నెల రోజుల క్రితం వరకు ఈ కళాకారులకు ఉపాధి దొరకడం కష్టంగా వుండేది. సమైక్యాంధ్ర ఆందోళనల్లో భాగంగా ఊరేగింపులు సభలు, సమావేశాలు, ధర్నాలు జరుగుతున్నాయి. రాజకీయ పార్టీలు, వివిధ సంఘాలు, ఉద్యోగులు నిర్వహించే కార్యక్రమాలకు డప్పు కళాకారులను తీసుకు వస్తున్నారు. ప్రతిరోజు నగరంలో జరిగే రెండు, మూడు ఊరేగింపుల్లో డప్పులు వాయించడం వలన ఒక్కొక్కరికి 200 రూపాయలు అందుతుంది. డప్పు కళాకారులతోపాటు రాజస్థాన్‌కు చెందిన కొందరు కళాకారులు కూడా అధునాతనమైన డప్పులు ఉపయోగిస్తుండడంతో వీరికి డిమాండ్ పెరిగింది. పగటి పూట సమైక్యాంధ్ర ఆందోళనలకు డప్పు వాయిస్తూ రాత్రిపూట వినాయక చవితి నిమజ్జనం కార్యక్రమాల్లో పాల్గొన్నారు. సమైక్యాంధ్ర ఉద్యమం, వినాయక చవితి మూలంగా డప్పు కళాకారులకు ఉపాధి దొరికిందని చెప్పకతప్పదు.

## నిప్పుతో చెలగాటం

మొదటి పేజీ కొరవ

లని రెచ్చగొట్టే ప్రకటన చేశాడు. దిగ్విజయ్ సింగ్‌ది రాజకీయ అనుభవరాహిత్యం అయితే, కెసిఆర్‌ది రాజకీయ స్వార్థ వ్యూహం. తన ప్రమేయం లేకుండా, తనతో సంప్రదింపులు లేకుండా తెలంగాణ ఇచ్చేయడం ఆయనకు నచ్చలేదు. ఆ ప్రక్రియను అడ్డుకోవడం కోసమే ఒక వ్యూహం ప్రకారం ఆంధ్ర ప్రాంత ఉద్యోగులను రెచ్చగొట్టాడాయన. 2014 ఎన్నికల వరకు ఈ ప్రక్రియను ఆపితే, తనకు అధిక సంఖ్యలో సీట్లు దక్కుతాయని వాటిని అడ్డుపెట్టుకొని కేంద్రంలో పెత్తనం చలాయించి, తన చేతులమీదుగా తెలంగాణ తెచ్చి, ఆ ప్రాంత ప్రజల దృష్టిలో తానొక జాతిపితగా మిగిలి పోవాలన్న స్వార్థంతో కుట్రపూరిత ప్రకటన చేశాడు కెసిఆర్. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఆ నిప్పును ఎగద్రోసి మంటగా మార్చాడు.

ఇప్పుడు కింకర్తవ్యం? 2014 ఎన్నికల వరకు ఈ వివాదాన్ని సాగదీయడం తప్ప కాంగ్రెస్‌కు వేరే గత్యంతరం కన్పించడం లేదు. నీళ్లు, నిధులు, ఉద్యోగాలు, విద్యా సంస్థలు, ఉద్యోగుల బదలీలు, హైదరాబాద్ రాజధాని వంటి అంశాల మీద ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంత ప్రజల అభిప్రాయాలు తెలుసుకోవడం కోసం వివిధ కమిటీలు వేసి, వాటి నివేదిక వచ్చిన తర్వాత విభజన ప్రక్రియ మొదలు పెడతామని ప్రకటించి, మంత్రులతోనూ, ఇతరత్రా పెద్దలతోనూ ఉప సంఘాలు నియమించి చర్చలు మొదలు పెట్టడం ఒక్కటే కాంగ్రెస్ ముందు మిగిలి వున్న ప్రత్యామ్నాయం. నిర్ణయం తీసుకొన్నాము కాబట్టి ముందుకే వెళ్తామని మూర్ఖంగా వ్యవహరిస్తే ఆంధ్రలో ఏ పరిణామాలు తలెత్తుతాయో ఎవరూ వూహించలేకున్నారు. అట్లని తెలంగాణ అంశం పక్కన పెట్టామని చెప్తే ఆ ప్రాంతం భగ్గుమంటుంది. ఇప్పటి వరకు అక్కడ జరిగిన ఉద్యమానికి, వెనక్కు వెళ్తే చెలరేగబోయే ఉద్యమానికి పోలికే వుండదు.

నిజం చెప్పాలంటే ఆంధ్రలో జరుగుతున్నది ప్రజా ఉద్యమం కాదు. ప్రభుత్వ ఉద్యమం. ఇందులో పాల్గొంటున్నది మూడు వర్గాల వారు. మొదటిది ఉద్యోగులు. వారిది బదలీల గోల. రెండవ వర్గం పొదుపులక్ష్మి, డ్వాక్రా మహిళలు. వారిని ఉన్నతాధికారులు బలవంతంగా తెచ్చి ఉద్యమంలో ముందు నిలుపుతున్నారు. మూడవది స్కూల్ పిల్లలు. వారిని కూడా వీధులలోకి తెస్తున్నది అధికారులే. ఈ ఉద్యమంలో రాజకీయ ప్రమేయం చాలా తక్కువ. కాంగ్రెస్, టిడిపి, వైఎస్ జగన్ పార్టీలు ఉద్యమంలో మేమూ ఉన్నామని చెప్పుకోవడానికి నానా తంటాలు పడుతున్నాయి. కానీ వారు పిలిస్తే జనం రావడం లేదు. వారు స్వంతంగా జరిపే కార్యక్రమాలకు కూలీ జనం మాత్రమే వస్తున్నారన్నది కాదనలేని సత్యం. అదనపు జాయింట్ కలెక్టర్ కార్యాలయాలు ఉద్యమ కేంద్రాలుగా మారి పోయాయి. వారే అన్ని వర్గాల ప్రతినిధులను పిలిపించి ఈ రోజు ఏమి చేయాలో ఆదేశిస్తున్నారు. వ్యాపార వర్గాలను ముగ్గులోకి దించడానికి సేల్స్ టాక్స్ అధికారులను వాడుతున్నారంటే ఈ ఉద్యమంలో ప్రభుత్వ ప్రమేయం ఎంత బహిరంగంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. డిఎస్పీ స్థాయి పోలీస్ అధికారులు రాజకీయవాదులకు, ఉద్యోగులకు ఫోన్లు చేసి, మీరు ఈ రోజు ఇక్కడ ధర్నా చేయండి అక్కడ రోడ్డు అడ్డగించండి అని సలహా ఇస్తున్నారు.

అయితే ఈనాడు, సాక్షి, ఆంధ్రజ్యోతి వంటి దినపత్రికలు, అన్ని టీవీ ఛానళ్ల యాజమాన్యాలు ఆంధ్ర దురభిమానం కల్గినవి కావడంతో ఉద్యమాన్ని భూతద్దంలో చూపి భయపెడుతున్నారు. గోరంతను కొండంతగా చేసి చూపిస్తున్నారు.

కానీ తెలంగాణాలో జరిగింది, జరగబోయేది నిజమైన ప్రజా ఉద్యమం. అక్కడ ప్రజలలో తమ రాష్ట్ర ఏర్పాటు పట్ల నిజమైన అభిలాష ఉంది. ఆవేశం వుంది. ఆక్రోశం వుంది. ప్రభుత్వము, పోలీసులు ఆ ఉద్యమానికి ఎన్ని రకాల అడ్డంకులు కల్పించాయో, ఎన్ని కేసులు పెట్టి వేధించాయో మనకు తెలుసు. కానీ చెరసాలలు, కోర్టు కేసులు వారి ఉద్యమ ఆవేశాన్ని అణుమాత్రం తగ్గించలేదు. ఇప్పుడు వారి ఆత్మాభిమానం మరింత దెబ్బతిని వుంది. మనసులు గాయపడి ఉన్నాయి. తెలంగాణ ప్రాంత చరిత్ర, గత డెబ్బై ఎనభై సంవత్సరాలలో వారు చేసిన ఉద్యమాలు, వీరోచిత పోరాటాలు, తిరుగుబాట్లు వంటి వాటిని జ్ఞాపకం చేసుకొంటే, గమనంలోకి తీసుకొంటే తెలంగాణ ప్రాంతంలో చెలరేగబోయే ఆందోళన స్వరూపం భయపెడుతున్నది.

ఏది ఏమైనా కాంగ్రెస్ పార్టీ నిప్పుతో చెలగాటం మొదలు పెట్టింది. తెలిసి చేసినా, తెలియక చేసినా ఈ తప్పుకు రాష్ట్రం మొత్తం భారీ మూల్యం చెల్లించుకోక తప్పదు.

## ఆంధ్ర నేతల కినుక

మొదటి పేజీ కొరవ

మంత్రులు, ఎమ్పీలు ఏదో ఒక రూపంలో తాము ఆంధ్ర ప్రాంతం ప్రయోజనాలు కాపాడడానికి కృషి చేస్తున్నామని జనాన్ని నమ్మించే ప్రయత్నంలో వున్నారు. అందుకోసం సభలు సమావేశాలు జరపడం, ఢిల్లీ పెద్దలను కలవడం వంటివి చేస్తున్నారు. ప్రజలలో స్వంత పలుకుబడి కల్గిన చిరంజీవి కూడా అందరితో పాటు తానూ అన్నట్లు వ్యవహరిస్తున్నాడు. కానీ పనబాక లక్ష్మి మాత్రం సహచరుల పట్ల చాలా చులకన భావంతో ప్రవర్తిస్తున్నారన్నది ఆరోపణ. ఆమెను పిలిచినా సమావేశాలకు రావడం లేదు. పైపెచ్చు మీ చీకాకేమిటని విసుక్కొంటున్నారట. చీటికి మాటికి రాజీనామాలంటారేమిటని కసురు కొంటున్నారట. అది మిగతా కేంద్రమంత్రుల మనసులను గాయ పరుస్తున్నది. ఈమె ఎందుకిట్లా ప్రవర్తిస్తున్నారో అర్థం కావడం లేదని వాపోతున్నారు వారు. మరొకప్రక్క సీమాంధ్ర ఉద్యోగ సంఘాలు సైతం పనబాక పట్ల ఆగ్రహంతో వున్నాయి.

అధిష్టానం అనుగ్రహం కోసం, వారి మాట జవదాటడం లేదని నిరూపించుకోవడం కోసమే పనబాక ఈ తీరులో వున్నారన్నది అంచనా. అయితే కేంద్రంలోని మంత్రులందరూ అధిష్టానం అనుగ్రహానికి ప్రథమ ప్రాధాన్యత ఇచ్చేవారే. అందులో మినహాయింపులు లేవు. అధిష్టానాన్ని కాదంటే తమకు రాజకీయ భవిష్యత్తు లేదన్న నిజం అందరికీ తెలుసు. అయితే ప్రజలలో తీవ్రస్థాయిలో ఒక ఉద్యమం నడుస్తున్నది కాబట్టి, వారిని కూడా సంతృప్తిపరచడం తమ బాధ్యత అన్న కోణంలో మాత్రమే వారు జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు. అయితే పనబాకకు ఆ పట్టింపులు లేవు. ఏ కారణం వల్లనైనా కిరణ్ కుమార్‌రెడ్డిని గద్దె దించింతే, నాలుగురోజులే అయినా దాన్ని తన స్వంతం చేసుకోవాలన్నది ఆమె తపన.

## జగన్‌కు బెయిల్ ఖాయం?

మొదటి పేజీ కొరవ

చూపే పరిస్థితులు పెద్దగా లేవు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి తన పదవి ఇంకా ఎన్ని రోజులని లెక్క పెట్టుకొంటున్నాడు. జగన్ విషయంలో పట్టుదల చూపి పలుకుబడి ప్రయోగించే పరిస్థితిలో ఆయన లేడు. ఢిల్లీ పెద్దలకు జగన్ పట్ల కొంత సానుకూలత ఏర్పడిందని వినికిడి. వైఎస్ విజయమ్మ, వైవి సుబ్బారెడ్డి వంటి వారు కేంద్రంలోని ముఖ్యులతో పలుమార్లు చర్చలు జరుపుతున్నట్లు వార్తలొస్తున్నాయి. ఆ చర్చల సారాంశం ఏమిటో మనకు తెలియదు కానీ, తెలంగాణ ప్రాంతంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పూర్తిగా తుడిచి పెట్టుకొని పోవడంతో రేపటి ఎన్నికలలో జగన్‌ను చూసి పెద్దగా భయపడవలసిన అగత్యం లేదన్న భావన కాంగ్రెస్ వాదులలో కలుగుతున్నది. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో ఎంత గొప్ప ఓట్ల శాతం తెచ్చుకొన్నా జగన్ ముఖ్యమంత్రి కావడం అసాధ్యం. తెలంగాణలో ఆయనకు బోణీ దొరకడమే కష్టం. ఒక్క చంద్రబాబు మాత్రమే జగన్ బెయిల్‌ను అడ్డుకోవడానికి తన ప్రయత్నం తాను చేస్తున్నాడు. ఇడి, విజిలెన్స్ వంటి విభాగాలు జగన్ మీద తమ దర్యాప్తును పూర్తి చేయలేదు కాబట్టి, ఇప్పుడు బెయిల్ ఇవ్వడం సరికాదని ఆయన ఉన్నతాధికారులకు వినతి పత్రాలు సమర్పిస్తున్నాడు. అయితే ఆయన ప్రభావం న్యాయస్థానాల మీద, సిబిఐ మీద పెద్దగా ఉండే అవకాశం లేదు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

టుందన్నారు. సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొనే విషయంలో ఆనం బ్రదర్స్ శతబిషలు వీడాలని జయకుమార్‌రెడ్డి సూచించారు.

## శ్రీ వెంకటేశ్వర ఇంజనీరింగ్ కాలేజి ఘనత!

ఈ యేడాది జరిగిన ఇంజనీరింగ్ కౌన్సిలింగ్‌లో నార్తు రాజుపాళెంలోని శ్రీ వెంకటేశ్వర కాలేజి ఆఫ్ ఇంజనీరింగ్ కాలేజిలో 98 శాతం సీట్లు భర్తీ అయ్యాయి. ఈ కాలేజి ప్రారంభించిన ప్రథమ సంవత్సరం 92 శాతం, గత ఏడాది నూరు శాతం సీట్లు భర్తీ అయ్యాయి. మూడవ సంవత్సరం కూడా ఈ పరంపర కొనసాగడానికి విద్యార్థినీ విద్యార్థుల తల్లితండ్రులు తమ కాలేజి పట్ల చూపిన అభిమానాన్ని మెరుగైన ఫలితాలతో నిలబెట్టుకొంటామంటున్నారు కాలేజి ఛైర్మన్ బాబునాయుడు, ప్రిన్సిపల్ దత్తాత్రేయ శర్మ.

## ఆ కోతిని చూడలేదు!

ఆగష్టు 30వ తేది 'జమీన్‌రైతు' సంచికలో 'నెల్లూరు పోలీసును బిత్తర పెడుతున్న కోతి' శీర్షికన ప్రచురితమైన వార్తను డిపిఓ ఓ ప్రకటనలో ఖండించింది. కోతి రవిని గుంటూరు ఐజి, నెల్లూరు ఎస్పీగానీ ఇంతవరకు చూడడం జరగలేదని ఈ ప్రకటనలో స్పష్టం చేశారు.

## వల్లపరెడ్డి వెంకటరమణమ్మ మరణం

ముత్తుకూరు మండలం పెనవర్తి గ్రామ రైతు కుటుంబీకుడు స్వర్గీయ వల్లపరెడ్డి వెంకటకృష్ణారెడ్డి భార్య వల్లపరెడ్డి వెంకటరమణమ్మ(90) 17తేది మరణించారు. ఈమెను ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. కెవిఆర్ కుటుంబీకులు కలవకూరు శ్రీనివాసులురెడ్డి, ప్రభాకర్‌రెడ్డి ఈమెకు అల్లుళ్ళు. ఆత్మీయురాలిని కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

సీమాంధ్ర జిల్లాలలో సిగ్గులేకుండా ఏ విధంగా తిరుగుతున్నాడో అర్థం కావడం లేదు. చంద్రబాబు రెండుకళ్ల సిద్ధాంతం, ఆయనిచ్చిన లేఖను ఆధారం చేసుకొని కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విభజనకు పూనుకొంది. సీమాంధ్రుల కొత్త రాజధాని కట్టుకోను లక్షల కోట్ల రూపాయల ప్యాకేజి డిమాండ్ చేయడమేమిటి.

సి.సుజాత బుచ్చిరెడ్డిపాళెం

## సణుగుడు

9వ పేజీ కొరవ

పత్రిక ప్రధాన సంపాదకుడు సిద్దార్ద వరదరాజన్ నా పత్రికలో ఏ వార్త వచ్చినా నాదే బాధ్యత, మీకు కావాలంటే నన్ను అరెస్ట్ చేసుకోండి, నేను సిద్ధం, నా క్రింది ఉద్యోగుల మీద కేసులు పెట్టి సాధించజూస్తే సహించను అని ప్రకటన చేశాడు. అపూర్వమైన పాత్రికేయ సాహసం, మనో స్థైర్యం ఇది. ఒక సంపాదకుడు ఏ రీతిలో ప్రవర్తించాలో సరిగ్గా అదే తీరులో స్పందించాడు సిద్దార్ద వరదరాజన్. ఆయన్ను యావత్ పత్రికాలోకం అభినందనలతో ముచ్చెత్తుతున్నది. హిందూకు అండగా నిలవడానికి దేశంలోని అన్ని భాషల పత్రికలూ అడగకుండానే ముందుకు వస్తున్నాయి. ప్రతి పాత్రికేయుడూ అందుకు సిద్ధపడుతున్నాడు.

దినేష్‌రెడ్డి తన కక్షపూరిత వైఖరితో చాలా తప్పులు చేశాడు. ఆ పరంపరకు ఇది పరాకాష్ట. ఇప్పటికైనా తాను చేస్తున్నది సరైన పని కాదని గ్రహించి హిందూ పత్రికా సంపాదకుడికి బేషరతుగా క్షమాపణ చెప్పి, చెంపలేసుకోవడం ధర్మం. ఆ విశాల మానసం ఆయనలో కలగకుంటే నష్టపోయేది హిందూ సంపాదకుడు కాదు. తానే అన్న నిజం తెలుసుకోగల్గితే మంచిది.

కారే రాజులు, రాజ్యముల్ కల్గరే, వారీ ఉర్విపై పేరైనన్ కలరే అన్న పద్యం చిన్నతనంలో చదువుకోలేదా దినేష్‌రెడ్డి గారూ?

## అస్థిత్వాన్ని కోల్పోవడమే!

15వ పేజీ కొరవ

నీయమైన పరిస్థితి ఇది. హాస్టళ్ల పనితీరు, అక్కడి దౌర్భాగ్యమైన పరిస్థితుల్ని బాగుచేయడానికి చర్యలు తీసుకుంటున్నామని ప్రభుత్వం పదే పదే చెబుతున్నా అవి "తూతూ మంత్రం" చర్యలు. పరిస్థితులు మెరుగుపడతాయని అనాధ, పేద, మధ్యతరగతి పిల్లల పరిస్థితి ఈ హాస్టళ్లలో మెరుగు పడుతుందన్న ఆశ ఏకోశానా లేదు. మిధ్య, మిధ్య అంతా మిధ్య.

బ్రిటీష్ కాలమే మేలనిపిస్తున్నది. నల్ల దొరల పనితీరు చాలా దుర్మార్గంగానూ, నీతి బాహ్యంగానూ వుంటున్నది. ఈ విషయం శోచనీయం. మన దౌర్భాగ్యం!

# ప్రజలు ప్రైవేటీకరణవైపు మొగ్గు చూపడం తమ అస్థిత్వాన్ని కోల్పోవడమే!

నేటి సామాజిక పరిస్థితులను అన్ని కోణాల నుంచి విశ్లేషించి, విడమరచి, బేరీజు వేస్తే ప్రజలు, ప్రభుత్వాలు ప్రైవేటీకరణ వైపు మొగ్గు చూపిస్తున్నారని, ఇప్పటికే ఆ ఊబిలో దాదాపు కూరుకుపోయారని నిక్కచ్చితంగా, నిర్ద్వంద్వంగా, గాఢంగా, ప్రగాఢంగా అనిపిస్తున్నది.

ఒక్క క్షణం మనసును గుప్పిట పట్టుకొని కేంద్రీకృత భావంతో ఆలోచిస్తే ఈ పరిణామం ఎంత ప్రమాదకరమో, ఎంతటి వినాశకరమో అర్థమవుతుంది. ప్రభుత్వ స్వాధీనంలో వున్న పాఠశాలలు, వైద్యశాలలు, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ అజమాయిషీలోని అనేక సంస్థలు, ఇప్పటికి ఏ స్థితిలో వున్నాయో చూస్తే ఒళ్లు జలదరిస్తుంది. గుండెల్లో గుబులు రేగుతుంది. మనం దేన్ని కోల్పోతున్నామో, ఎంతటి దుస్థితిలో ఉన్నామో, ఎంతగా దిగజారిపోతున్నామో అర్థమవుతుంది. ఈ పరిస్థితులు సామాన్యుడి, మధ్యతరగతీయుల ఎదుగుదలకు అవరోధాలుగా మారుతాయి. ఆర్థిక స్థాయి మధ్య, మనిషి మనిషికీ మధ్య అగాధాలు సృష్టి స్తాయి. కొంతకాలం తర్వాత ప్రజాస్వామ్యం ధనస్వామ్యంగా మారిపోతుంది. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల గరీబీ హఠావో మురికివాడల తొలగింపు, సామాన్యుడిని ఆర్థిక స్థాయిని పెంచడం వంటి అనేక ఆదర్శాలు కేవలం పొలికేకలుగా, స్లోగన్లుగా నిలిచిపోతాయి. ప్రపంచ దేశాలు భారతదేశ దౌర్భాగ్య పరిస్థితిని బట్టి పగలబడి నవ్వుతాయి. దేశవిదేశాల్లో భారతీయ సంస్కృతి అపహాస్యం పాలవుతుంది. ఒకప్పుడు సింధూ, హరప్పా, మొహెంజాదారో నాగరికతలతో ప్రపంచ దేశాలకంటే ముందున్న భారతదేశం స్వార్థం, అవినీతి, నిరాసక్తత, నిర్లిప్తత, సోమరితనం, వంటి అనేకానేక దౌర్భాగ్యకర స్థితుల వల్ల, కల్మషాల వల్ల నిరుపేద దేశాలకు ఆఖరున నిలబడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మచ్చుకొన్ని సామాజిక స్థితిగతులను విశ్లేషించుకుందాం

## విద్య

గురుకులాలు ఒకప్పటి భారతీయ ఉన్నత విద్యాపాటవానికి నిదర్శనాలు. రాజాధిరాజుల పిల్లల నుండి సామాన్యుడి పిల్లల వరకూ అందరికీ సమాన ప్రాతిపదికన గురుకులాలలో స్థానం లభించేది. ఆయా కాలాలకు అవసరమైన విద్యలు అక్కడ బోధించబడేవి. రాజ పోషణలో ఈ ఆశ్రమాలు నడిచేవి. గురు, శిష్యులలో సంస్కారాలు సమస్థాయిలో ఉండేవి. నిర్దుష్టమైన క్రమశిక్షణను పాటించే వారు. విధివిధానాల పట్ల ఖచ్చితమైన అభిప్రాయాలుండేవి. ఎవరి హద్దుల్లో వాళ్ళుండే వాళ్ళు. భారతీయ సంస్కృతి, సాహిత్యం, ఖగోళం, చిత్రలేఖనం, యుద్ధ విద్యలు, ఆయుర్వేదం వంటి అనేకానేక అంశాలు బోధించబడేవి. చతుర్వేదాలతోబాటు సామాజిక అవసరాలకు ఉపయుక్తమైన విద్యలు నేర్పబడేవి.

## ఆధునిక కాలంలో

1960–71 మధ్య ప్రభుత్వ ప్రాథమిక, ప్రాథమికోన్నత, హైస్కూలు, జూనియర్ కళాశాల, డిగ్రీ కళాశాల, యూనివర్శిటీలు తప్ప ప్రైవేటు విద్యాశాలల ఊసేలేదు. అప్పట్లో కొందరు ఉపాధ్యాయులు, వెనుకబడిన విద్యార్థుల కోసం ట్యూషన్లు చెప్పేవాళ్లు. తర్వాత తర్వాత కాలంలో ట్యూషన్ సంస్థలు, ఆయా సబ్జెక్టులలో గైడ్లు విస్తారంగా ఏర్పడ్డాయి. అప్పటి ఆ పరిస్థితులను ఎవరూ పట్టించుకోలేదు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు తీవ్రమైన నిర్లక్ష్య వైఖరిని కనబరిచాయి. ఇదే పెద్ద తప్పిదంగా తయారయింది.

పొలాల్లో కలుపు మొక్కల్ని నిర్లక్ష్యం చేయదం ఎంత ప్రమాదకరమో, మల్లెతోటలో గంజాయి మొక్కల్ని పెకలించి వేయకపోవడం ఎంత నేరమో, నందనవనాలలో విష వృక్షాలను గుర్తించకపోవడం ఎంతటి తీవ్రమైన విషయమో, అంతగాను విద్య విషయంలో తీవ్రమైన విషబీజాలు నాటుకున్నాయి. ట్యూషను సంస్థలు, ట్యుటోరియల్స్‌గానూ, ఆ తర్వాత ప్రైవేటు విద్యాసంస్థలుగాను మారాయి. ఈ పరిస్థితి ఎలా వుందంటే వ్యాపారం కోసం భారతదేశానికి వచ్చిన డచ్చి, ఆంగ్లేయులు వంటి విదేశీయులు క్రమంగా కోటలు కట్టుకొని సైన్యాన్ని పెంచుకొని దేశీయ సంస్థలను శాసించే నియంతలుగా ఎట్లా మారాయో, ఈ ప్రైవేటు విద్యాసంస్థలు కూడా ప్రజల్ని, ప్రభుత్వ పాఠశాలల్ని శాసించే స్థాయికి ఎదిగాయి. ఇది ప్రజల బలహీనత, ప్రభుత్వ అసమర్థత, మేధావుల నిర్లిప్తత అన్నది పచ్చి నిజం.

ఆధునికకాలంలో పేదవాడు కూడా పిల్లల్ని ప్రైవేటు పాఠశాలల్లో చదివించడానికి ప్రయత్నిస్తున్నాడు అంటే ప్రైవేటు విద్యాసంస్థలు ఎంతగా వ్రేళ్లూనుకుపోయి, పోటాపోటీగా ఉత్తీర్ణతాశాతాన్ని చూపించి ప్రజలకు ఏవిధంగా గాలాలు వేస్తున్నారో అర్థమవుతుంది. నాణానికి రెండో వైపు కోణం ప్రభుత్వ పాఠశాలలది. అవి ఎంతగా వెనుకబడి వున్నాయో, ఎంతటి దౌర్భాగ్య, నికృష్ట స్థాయిలో ఉన్నాయో అర్థమవుతుంది.

**డాక్టర్ పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**

ప్రభుత్వ పాఠశాలల స్థాయి ఇంతగా దిగజారడమన్నది ప్రభుత్వ నిర్లక్ష్యం వల్లనా, అధ్యాపకుల అలసత్వం వల్లనా అన్నది అందరికీ అర్థమైపోయింది. ఇట్లాంటి పరిస్థితున్నప్పుడు ప్రభుత్వం నిర్దుష్టమైన, కఠినమైన చర్యలు తీసుకోవలసిన అవసరం లేదా? ఇది వేలకు వేలు జీతాలు తీసుకొంటున్న అధికారుల బాధ్యత కాదా? ఈ విషయంలో ప్రజల్ని నిందించి ప్రయోజనం లేదు. ప్రభుత్వ పాఠశాలల దీన, హీన పరిస్థితులను చూసి తమ పిల్లల్ని అందులో చదివించడానికి వెనకడుగు వేస్తున్నారు. ఇందులో వారి తప్పులేదు. అధికారులు, అధ్యాపకులూ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడంలోనూ, విద్యాప్రమాణాలు పెంచడంలోనూ ఘోరంగా విఫలమయ్యారు. ఈ పరిస్థితులలో ప్రవేటు విద్య రాక్షస వృక్షాల్లా, శతసహస్ర శాఖోపశాఖలతో విస్తరించి పోయాయి. ఈ పరిస్థితికి ముఖ్య కారణం అలసత్వం, నిర్లక్ష్యం, మొద్దు నిద్రపోవడం, దున్నపోతుల్లా దళసరి చర్మాల్ని పెంచుకోవడం. ఈ విషయం నిర్ద్వందం, నిక్కచ్చితం, యదార్థం. ఇందువల్ల చదువు 'కొనడం' అయిపోయింది. లక్షలకు లక్షలు చెల్లించగల వారికే 'విద్య' లభ్యమవుతున్నది? మరి మధ్యతరగతి, పేదవారి పరిస్థితి ఏమిటి?

దేశ ప్రగతికి, ముందంజకు అవసరం, ముఖ్య కారణం విద్య. ఈ రోజు సమాజంలో అక్షరాస్యతా శాతం కేరళ వంటి రాష్ట్రాలతో పోల్చుకుంటే ఆంధ్రప్రదేశ్ పరిస్థితి దయనీయం. ఈ నాటి అనారోగ్యవంతమైన అనేకానేక పరిస్థితులకు, నీతి బాహ్యమైన స్థితిగతులకు ముఖ్య కారణం అవిద్య. పరిస్థితి ఇలా వుంటే మధ్యతరగతి పేద, అట్టడుగు వర్గాలు నిరక్షరాస్యులుగా మిగిలిపోతే, ప్రభుత్వం ఎంతగా నవ్వుల పాలవుతుంది. సమాజం అవిద్యతో మరిన్ని నీతిబాహ్యమైన సంఘవిద్రోహ శక్తులకు ఆలవాలమవుతుందో ఆలోచించండి! అవలోకించండి!! ఆత్మ పరిశీలన చేసుకోండి!!!

## ఆస్పత్రులు, ఆరోగ్యం!

ప్రభుత్వ పాఠశాలలాగే ప్రభుత్వ ఆస్పత్రుల పరిస్థితి కూడా మరింత ఘోరంగా వుంది. వైద్యశాలలు చాలావరకు శిథిలావస్థలో వున్నాయి. సరైన వైద్య పరికరాలు లేవు. డాక్టర్లు, ఇతర వైద్య సిబ్బంది అందుబాటులో వుండరు. ఈ కారణాల వల్ల ఆరోగ్య శాఖ ఉద్యోగులు ప్రైవేటు ప్రాక్టీసులు పెట్టుకోవడం, ప్రైవేటు ఆస్పత్రులలో పని చేయడం, వీరిపై అధికారులకు సరైన ఆధిపత్యం, అజమాయిషీ లేకపోవడం, రాజకీయ నాయకుల అనవసర జోక్యాలతో వైద్యశాలల పరిస్థితిని మరింత అధ్వాన్నంగా తయారు చేశాయి. ఫలితంగా ప్రైవేటు ఆస్పత్రులు మర్రి వృక్షాల్లా వ్రేళ్లూనుకుని శాఖోపశాఖలుగా విస్తరించాయి. అవి వైద్య సేవల విషయంలో భేషయినా, ధనదాహం, అనుమతిలేని మందుల్ని ప్రిస్క్రైబ్ చేయడం వంటి పనుల వల్ల ప్రజలు దోపిడీకి గురౌతున్నారు.

పరదేశాలలో నిషేధానికి గురైన చాలా మందులు భారతదేశంలో చలామణి అవుతూ ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్నాయి. ఈ నిజం ప్రభుత్వానికి, అధికారులకు తెలుసు. మరి తీసుకున్న చర్యలెన్ని? అజమాయిషీ ఏ స్థాయిలో వుంది. మామూలు జ్వరాలకు కూడా అత్యధిక ఖరీదైన 'ప్లేట్‌లెట్స్'ని ఎందుకు ఎక్కిస్తున్నారు? నిషేధానికి గురైన లింగ నిర్ధారణ పరీక్షలు ఎందువల్ల జరుగుతున్నాయి. అనవసర మందుల పట్టీలు ఎందుకు రాస్తున్నారు? మామూలు కాన్పుల్ని సిజేరియన్ కాన్పులుగా ఎందుకు చేస్తున్నారు. ఇంతటి దురాగతాలు జరుగుతుంటే ప్రభుత్వము, అధికారులూ ఏం చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వ వైద్యశాలల్ని ఆధునీకరించేందుకు, ప్రజల్ని ప్రభుత్వ వైద్యశాలలకు రప్పించే చర్యల్ని ఎందుకు తీసుకోరు. ఈ విషయంలో మేధావుల అభిప్రాయం ఒక్కటే. "ప్రజల్లో చైతన్యం లేదు – తాము ఏ విధంగా నష్టపోతున్నామో అర్థం చేసుకోవడంలేదు. అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడంలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే దద్దమ్మలైపోయారు! గొర్రె జనమైపోయారు!! నిద్రాణమైన స్థితిలో బలహీనులుగా మిగిలిపోయారు!!!"

## హాస్టళ్లు

ప్రభుత్వ హాస్టళ్ల పరిస్థితి మరింత ఘోరం. "అన్నంలో పురుగులు" మాటని ప్రజలు బాగా విని వుంటారు. హాస్టళ్లలోని విద్యార్థుల దయ

కొరవ 14వ పేజీలో

## పదరంగం -85

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | 5 | | 6 | 7 |
| | | 8 | | 9 | | | | 10 | |
| | | | | 11 | 12 | | | | |
| 13 | | | | 14 | | | 15 | | 16 |
| | | | 17 | | | | 18 | 19 | |
| | 20 | | | | | 21 | | | |
| 22 | | | 23 | 24 | 25 | | | | |
| 26 | | | | 27 | | 28 | 29 | 30 | |
| 31 | | | | 32 | | | | | |
| 33 | | | | | | | 34 | | |

**అడ్డం**

1. కోరిక (4)
4. నేర్పరితనం (5)
8. అటునుంచి రామోజీ రావు గారి జంట మాస పత్రికలలో ఒకటి (3)
10. మాట, వాచకం (2)
11. సువాసన మొక్క మరువంతో పాటిది (3)
13. తెలుగు పేపర్ (3)
14. రమ్మని పిలవండి (2)
17. స్పీడుగా, వడిగా (3)
18. అటునుంచి మామిడి చిగురు రుచి (3)
20. ఎటునుంచి అయినా వయ్యారమే (3)
21. కౌమిల్కు (4)
22. తెలుగు కాంపిటిషన్ (2)
23. మోహం, తెలుగు ఫేస్ (3)
26. తడబడిన లలిత (3)
27. సరిగమల తరువాత... (5)
31. నాయకత్వము 3,4 అక్షరాలు (2)
32. సారకాయలు (6)
33. అటునుంచే వస్తున్నాయి సర్పాలు (3)
34. అటునుంచి టైము, సమయం (2)

**నిలువు**

1. కొద్దికాలం, చిరకాలం కాదు (5)
2. పచ్చరాయి (4)
3. సాంప్రదాయం జరుగుతున్న పని (2)
5. కవిత్వం, తేలిక మాటలలో (3)
6. తడబడిన వాక్యము (3)
7. నాసిక (2)
9. తెలుగు చెస్ ఆట (4)
12. వేగంగా (3)
15. దప్పు మీద వేసేది ఒక సినిమా పేరు (3)
16. సన్మాన సమయాలలో మీద కప్పేది క్రింద నుంచి వస్తున్నాయి (4)
17. తెల్లవారుజాము (3)
19. క్రిందనుంచి తలగుడ్డ (2)
20. కుటిలుడికి ఉండే తత్వం(5)
22. సారూప్యములు మొక్కట్లు (4)
24. క్రిందనుంచే ప్రమాదం (3)
25. ఖర తర్వాతి తెలుగు సంవత్సరం (3)
28. క్రిందనుంచి తెలుగువర్క్(2)
29. సరియైన కాలం (3)
30. క్రిందనుంచి పండ్లు కావు (3)

**సమాధానాలు**

## పదరంగం -84

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 స | క | 2 లం | | 3 మ | | | 4 ప్ర | 5 తి | 6 భ |
| దు | | 7 చం | 8 ప | క | 9 మా | 10 ల | | 11 నా | ర |
| 12 పా | 13 పి | | 14 ద | రి | మి | ల | | | తు |
| 15 యం | కా | | వి | | | 16 న | 17 కు | 18 లు | డు |
| | 19 స్తో | 20 ది | | 21 ప | ని | | 22 ఋ | వు | |
| 23 న్న | | 24 న | ట | న | | 25 స | వ | ర | ణ |
| 26 అ | 27 ల | క | | 28 స | 29 ల | హా | | కా | |
| | 30 వ | రు | డు | | 31 క్ష | యం | | | 32 వి |
| 33 చో | రు | డు | | 34 కో | ణం | | 35 పా | 36 కు | డు |
| టు | | | 37 పా | ట | | 38 ఆ | క | లిం | పు |




అక్క, నేను కలసి వుండాలని కోరుకొన్నావు!!
ఉగ్గుపాలతో నీవు కలగలిపి నేర్పిన -
ఆ 'బంధం' ఆ 'అనుబంధం' విలువ
అమూల్యం! అనిర్వచనీయం!!
అనుభవిస్తే గాని అర్థం కాని ఆ 'అనుభూతి'ని
బిడ్డబిడ్డలం పంచుకొని మరీ పెంచుకొంటున్నాం
ఓటమెరగని తల్లికి సదా ఋణపడిన...

కుమార్తె : కలవకూరు సూర్యకళారెడ్డి, బి.ఎ.బి.ఎల్.,



కీ॥శే॥ వల్లపరెడ్డి వెంకట రమణమ్మ గారు
W/o స్వర్గీయ వల్లపరెడ్డి వెంకటకృష్ణారెడ్డి గారు
మరణం : 17-09-2013

| అల్లుళ్ళు | కుమార్తెలు |
|---|---|
| కలవకూరు శ్రీనివాసులురెడ్డి (KVR) | Late కలవకూరు చంద్రకళారెడ్డి బి.ఎ.బి.ఎల్., |
| కలవకూరు ప్రభాకర్‌రెడ్డి (KVR) | కలవకూరు సూర్యకళారెడ్డి బి.ఎ.బి.ఎల్., |

మనుమడు : కలవకూరు విష్ణుకిరణ్ (USA) – హారిణీరెడ్డి     బేబి శ్రీదియారెడ్డి

మనుమరాళ్ళు :
యం.గాహితారెడ్డి – యం.వాసుదేవరెడ్డి (USA)     అనొష్కారెడ్డి, తనిష్కారెడ్డి
పి.సామితారెడ్డి – పి.శ్రీరామ్‌రెడ్డి (HYD)     శ్రీహర్షిత్‌రెడ్డి, శ్రీపునీత్‌రెడ్డి
కె.నిహితారెడ్డి B.Tech

**KVR Brothers & Sons**
మరియు కుటుంబ సభ్యులు, నెల్లూరు

**ఉత్తరక్రియలు :** తేది 25-09-2013 బుధవారం ఉదయం 10 గంటలకు "పెద్దకర్మ" నెల్లూరు, విఆర్‌సి సెంటర్, జవహర్‌లాల్ నెహ్రూరోడ్డులోని (టవర్ క్లాక్ ఎదురు) మా స్వగృహము నందు జరుగును. కావున బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com